శ్రీరస్తు.

# స్వారోచిషము.

## ప్రస్తావన.

ఉ॥ శ్రీకరమున్విశిష్టపరిసృష్ట్యవనప్రళయాదిభేదకా।
ర్యాకరముల్ జిదాత్మకమహామహిమంబునిజాప్రమేయమా।
యాకలితంబునిర్మలనిరంజననిర్గుణనిర్వికల్పభా।
వాకలనంబునై వెలయు నాపరతత్వము నాశ్రయించెదన్॥

సూత్ర—(తెరవంకఁ జూచుచు) ఓయీ స్థాపకా ఏల యీ యాలస్యము.

నటుఁడు—ఇదిగో వచ్చినాఁడను. ఏమి యాజ్ఞ.

సూత్ర—మనము నేఁడు ప్రదర్శింపఁబోవు నాటకమును చూచు వేడుకతో నీ మహాజను లందఱును వచ్చి వేచియున్నవారు. ఇఁక జాగుసేయక ప్రారంభించుట యుక్త మని తోఁచెడిని.

నటుఁడు—మనము నేఁడు ప్రదర్శింపవలసిన నాటక మెద్ది.

సూత్ర—స్వారోచిషమని పేర్కొనంబడు మిగుల రమణీయంబగు నొక నవీననాటకమును ప్రదర్శింపవలయునని నాయుద్దేశము.

నటుఁడు—ఈకథ యేపురాణమందలిది.

సూత్ర—ఇది మహనీయంబగు మార్కండేయపురాణమందలిది.

నటుఁడు—దీనిన్ రచించిన మహాకవి యెవఁడు.

సూత్ర—

సీ॥ అమలాగ్రజన్మమాహాత్మ్యవిశేషంబు సద్వశిష్టసగోత్రసంభవంబు।
ఘనమగు నాశ్వలాయనసూత్రకథనంబు బడగనాడన్వయప్రాభవంబు।
మాన్యమానద్వైతమతనిశ్చితత్వంబు సతతతత్వవిచారసంభ్రమంబు।
హూణాంధ్రవిద్యాప్రవీణతాధిక్యంబు కవితాచమత్కారకౌశలంబు।
గీ॥ తేజరిలు వ్యాఘ్రవాదివృత్తిక్రమంబు। విబుధజనతావిధేయతావితరణంబు।
గలిగిఘనగిరిపురిమును గలయ వెలయు। శేయుఁగొద్దిముహనుమంతరాయసుకవి॥

నటుఁడు—ఇమ్మహానాటకంబునందేయే కథాసందర్భములు గలవు.

సూత్ర—

సీ॥ ప్రవరాఖ్యుఁడగుద్విజప్రవరుఁడొక్కరుఁడు సిద్ధౌషధమహిమహిమాద్రిఁ గనుట।
అతఁడు వరూధిని యను నప్సరోంగన వలచినఁ గలయక తొలఁగి చనుట।
వాని వేషముఁ దాను బూని యొక్కఁడొకండు వంచించి దానిరమించి చనుట।
గర్భంబుఁ దాల్చి యా కాంత స్వరోచి నామహితుఁడౌ నొకమహామహునిఁ గనుట।
గీ॥ అతఁ డాశైలమున మృగయావిహార। కాంక్షఁ దిరుగుచు శరణన్న కాంతనసుర।
వాతఁబడనీక ప్రోచి వివాహమగుట। మొదలుగాఁ గలకథ లిందుఁ బొదలుచుండు॥

నటుఁడు—ఆహా ఇది మహాస్వారస్యము కలదిగా నుండవచ్చును. ప్రదర్శనార్హమనియె తోఁచెడిని.

సూత్ర—మన కెట్లున్నను స్వారస్యమె. ఈ సభాసదులు కదా దానిఁ జూచి ప్రహర్షింపవలయును.

నటుఁడు—అవును. ఇది నూతనమగు నాటకమగుటచే దీనిఁ సర్వజనసమ్మతంబుగఁ బ్రదర్శించు యోగ్యత మనకుఁ గలదో లేదో అనుసంశయంబు వొడముచున్నయది.

సూత్రి—ఈ మహాజనులు గుణగ్రాహులు. మన మీవిషయమున సంశయింపవలసి యుండదు. సాధ్యమగునంతవఱకు వారి నామోదింప యత్నింతము రమ్ము.

(అని ఇరువురు నిష్క్రమించుచున్నారు.)

---

శ్రీరస్తు.

# స్వారోచిషము.

## ప్రథమాంకము—ప్రథమరంగము.

### అరుణాస్పదపురము—ప్రవరునిమందిరము.

[కఠుఁడు, శఠుఁడు అను శిష్యులతో ప్రవరుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

ప్రవరుఁడు— ఓరీ! కఠ పురుషసూక్తము నీకు కంఠస్థముగ వచ్చుచున్నదా.

కఠుఁడు—స్వామీ! వచ్చుచున్నది. తాము నిన్ననె పరిక్షించినారే.

ప్రవ—అవును నిజమె శ్రీ సూక్తమున "యాసాపద్మాసనస్థా" అను శ్లోకము నిర్దుష్టముగ వచ్చుచున్నదేమో చూతము. పఠింపుము.

కఠుఁడు—స్వామీ చిత్తగింపుము.

శ్లో॥ "యాసాపద్మాసనస్థా విపులకటితటీ పద్మపత్రాయతాక్షీ।
గంభీరావర్తనాభీ స్తనభరనమితా శుభ్రవస్త్రోత్తరీయా।
లక్ష్మీర్దివ్యైర్గజేంద్రైర్మణిగణఖచితైస్స్నాపితా హేమకుంభైః।
ర్నిత్యంసాపద్మహస్తా మమవసతుగృహే సర్వమాంగల్యయుక్తా॥

ప్రవ—సరె. ఏదీ - అట్లనె - "లక్ష్మీంక్షీరసముద్రరాజతనయాం" చెప్పుము.

కఠుఁడు—శ్లో॥ లక్ష్మీంక్షీరసముద్రరాజతనయాం శ్రీరంగధామేశ్వరీం।
దాసీభూతసమస్తదేవవనితాం లోకైకదీపాంకురాం।
శ్రీమన్మందకటాక్షలబ్ధవిభవ బ్రహ్మేంద్రగంగాధరాం।
త్వాం త్రైలోక్యకుటుంబినీం సరసిజాం వందేముకుందప్రియాం॥

ప్రవ—ఓరీ! శఠా. నీకు భూ సూక్తము వచ్చుచున్నదా.

శఠుఁడు—మహాస్వామీ వచ్చుచున్నది.

ప్రవ—ఏదీ చూతము.

శఠుఁడు—"భూర్భూమిరచలానంతా రసావిశ్వంభరాస్థిరా"

ప్రవ—ఏమిరా. అమరము పఠించుచున్నావు. ఇదేనా నీభూసూక్తము. ఏదీ అన్న సూక్త మెంతమట్టో చూతము.

శతుఁడు—(ఆవలించుచు) "అగస్త్యంకుంభకర్ణంచ శమంచ బడబానలం"
ప్రవ—ఆహా! ఏమిరా ఈయావలింపులు. ఏమిరా ఈ దిగ్భ్రిమ.
శతుఁడు—స్వామీ! మఱచితిని. అది కాదు. ఇదిగో "అన్నంచపాయసంభక్ష్యం"
ప్రవ—ఆహా! ఏమిరా ఈప్రమాదము. చాలు చాలు నీ యోగ్యత. శ్రాద్ధయోగ్యము గానే యున్నది. ఈ పుస్తకమును చేతఁబట్టుకొని చక్కఁగా పఠింపుము. నీకు రాదు. నాకు మఱపదు.

(శతునివంకఁ జూచుచు)

ఓరీ! శత-రుద్రాభిషేక ధ్యానశ్లోకము నీకు చక్కఁగా రాక తప్పిపోవుచుండెనే వల్లించి గట్టి చేసినావా!
శతుఁడు—స్వామీ! ఇంకా చేయుచున్నాను.
ప్రవ—ఏదీ ఎక్కడఁ దప్పుచున్నదో చూతము.
శతుఁడు—"శ్లో॥ ఆపాతాళనభస్థలాంతభువన బ్రహ్మాండమావిస్ఫుర।
జ్జ్యోతిస్స్ఫాటికలింగమౌళివిలసత్పూర్ణేందువాంతామృతైః।
అస్తోకాప్లుతమేకమీశమనిశం రుద్రానువాకాన్ జపన్।
ధ్యాయేదీప్సితసిద్ధయే ధ్రువపదం విప్రోభిషించేచ్ఛివం॥

ప్రవ—చక్కఁగా వచ్చుచున్నదే. ఇలువలెకదా. పాఠములు నేర్చుకొనుచుండవలయును.

[ఇంతలో అచ్చటికి ఒకానొక సిద్ధపురుషుఁడు వచ్చుచున్నాఁడు.]

ప్రవ—(ఆశ్చర్యపడి చూచుచు దిగ్గునలేచి) ఓరీ! శతశతులారా! మీ పాఠములు చాలు లెండి ఎవరో మహాత్ములు వచ్చుచున్నారు.

(అని వచించుచు ధన్యోస్మి. ధన్యోస్మి. అని సాష్టాంగదండప్రణాములర్పించి సుఖాసీనుంజేసి ఎదుట నిలువంబడి కరంబులు నిటలతటంబునం జేర్చి ముకుళించి.)

ప్రవ—మహాత్మా! ఏమి నా పుణ్యము. తమరాకచే నా గృహంబు పవిత్రంబయ్యె. తమ దర్శనంబున నా జన్మంబు పావనంబయ్యె.

1. తామెట్టి మహామహులరు!
2. మహనీయంబగు తమ నామంబు నలంకరించు నక్షీణశుభలక్షణంబులగు నక్షరంబులెవ్వి!
3. ఎచ్చటనుండి ఎచ్చటికేగుచు నాకస్మికంబుగ నా యింటి కరుదెంచితిరి.
4. ఏయే దేశంబులు, ఏయే పుణ్యస్థలంబులు, ఏయే పుణ్యతీర్థంబులు ఈక్షింపఁ గంటిరి.

మత్కర్ణ పుటపేయంబుగా నానతిచ్చి నన్నున్ మన్నింపుఁడు.

సిద్ధుఁడు—వత్సా! కూర్చుండుము. కూర్చుండుము. నీయొక్క భక్తివినయ తాత్పర్య శ్రద్ధాదులం జూడ నాకత్యంత హర్షంబయ్యె. వినుము.

క॥ సిద్ధుఁడబుద్ధుండనఁగఁబ్ర । సిద్ధుఁడ శ్రద్ధానుగతవిశిష్టతపస్సం।
సిద్ధుఁడనుద్ధతతాత్త్విక । బుద్ధినిబద్ధాగమప్రబుద్ధుఁడ నెపుడున్॥

సీ॥ ఇటబాలభానుసమిద్ధకాంచనవిభాభ్యంచితంబగునుదయాద్రిఁ జూచి।
ఇటమందమందసమీరవారవిహారరమ్యమామలయపర్వతముఁ జూచి।
ఇటసాంధ్యరాగసమేఘమానప్రభాత్యగణితంబగునస్తనగముఁ జూచి।
ఇటహిమానీసముత్కటసచ్ఛవిచ్ఛటాచ్ఛాదితంబగుహిమాచలముఁ జూచి।
గీ॥ అతతాచక్రవాళపరీతభూత । ధాత్రిఁ గలక్షేత్రతీర్థసంతతులుఁ జూచి।
మింటఁ బోవుమనిచటమీయింటవేద । పాశమాలించివచ్చితిఁపాఱఁ జూచి॥

ప్రవ—మహాత్మా! సమస్తపర్వతంబులయందును, హిమవంతంబు విశేషమహిమావంతంబనియును, అందు అనేక పుణ్యస్థలంబులు, అనేక పుణ్యతీర్థంబులు, అనేక పుణ్యారామంబులు, గలవని యొంతు వినుచుందును. అవి దుర్గమంబగు హిమబాహుళ్యంబున నెట్టివారికిని దర్శనంబున కసాధ్యంబులని పెద్దలు చెప్పుదురు. అమ్మహాహార్యప్రభావంబు మఱి కొంత వివరించి వర్ణించి నను గరుణించి మన్నింపుఁడు.

సిద్ధుఁడు—వత్సా! ఆమహాహిమాచలమాహాత్మ్యంబు వర్ణింప నెవ్వరితరంబు. నాచేనైన కొలంది కొంత వివరించెద, ఆలకింపుము.

సీ॥ భావింపఁబార్వతీపరమేశ్వరులచిద్విలాసభాసురము కైలాసశిఖరి।
అక్షీణవైభవాధ్యక్షుయక్షేశునికాపురంబగునలకాపురంబు।
ధీరోత్తములునరనారాయణులతపశ్శ్రీప్రభావముబదరీవనంబు।
మారమారమణాభిమానఘోరాఘవిదారకోదారకేదారవాటి।
గీ॥ లోకపావనకరమహాస్తోకమహిమ । నుత్తమఖ్యాతిఁ గాంచుగంగోత్తరంబు।
పుణ్యతమముమహావటభూరుహంబు । మొదలుగాఁ గలవటఁ గడుముదమొనర్చు॥

ప్రవ—మహాత్మా! ఇట్టి మహాస్థలంబులు సందర్శింపవలయునను నపేక్ష నాకున్ బొడముచున్నది. అమ్మహాభాగ్యంబు మాబోంట్లకెట్లు లభించు. అనట మఱియు నెట్టి విచిత్రంబులు గలవో. అయ్యో! ఏమి సేయుదు.

సిద్ధుఁడు—

సీ॥ శంభుండు సనకాదిసంయములకుతత్వమహిమఁదెల్పినయాశ్రమంబుఁజూడ।
పతిభక్తిఁబార్వతీసతితపమాచరించినకదంబవనంబుచెలువుఁజూడ।
మనసిజుండాయద్రుఁజెనకిభగ్నుఁడగుచుఁబడినకాసారవ్యాంపుఁబట్టెఁజూడ।
షణ్ముఖోదయమహాసౌభాగ్యగరిమనిస్తులమగుశరవణస్థలముఁజూడ।
గీ॥ భీము జితకాము మునివధూకాముఁజేసి । పరిధవిల్లినదారుకావనముఁజూడ।।
గనుటబహుజన్మసంచితాగణ్యపుణ్య । విభవమునఁజేసి కాకదుర్లభముసుమ్ము॥

ప్రవ—మహాత్మా! ఇట్టి మహాక్షేత్రంబులు వీక్షింపఁగల మీ యక్షీణపుణ్యదశాధ్యక్షతా విశేషం బేమనవచ్చు. నాకొక సంశయంబు వొడమచున్నయది. నను గరుణించి మన్నించెదరన్న విన్నవించెద.

సిద్ధుఁడు—కుమారా! సంశయించుట తప్పా. నీ సంశయంబునకుం గారణం బెయ్యది. వివరింపుము.

ప్రవ—స్వామీ! తాము మిగులఁ దరుణవయస్కులరు. ఇంత స్వల్పకాలంబున నిట్టి తపస్సంపన్నతఁ బడయుట యెట్లు. ఇంతటి దూరదేశంబులు గ్రుమ్మరుట యెట్లు. ఇట్టి విచిత్రవిశేషంబులఁ గాంచుట యెట్లు. నాకేమియుఁ దోఁపకున్నయది.

సిద్ధుఁడు—ఇదియా నీ సంశయము. నా వచనంబులు విన్న నిది సహజంబుగఁ గల్గు నట్టిదె వత్సా.

చ॥ మహితతపోమహామహిమమానితమంత్రరహస్యవైఖరీ।
మహిమమహామహౌషధిసమగ్రమహత్వవిశేషశేముషీ।
మహిమలఁ గాకయిట్టిమహిమంబులుశీఘ్రగతిం జరించియు।
మ్మహినిటు మాదృశుల్గనసమానమహామహిమంబుగల్గునే॥

శకుఁడు—అబ్బా! అబ్బబ్బ!! అంతా మహాసే అంతా మహామహిమే.

ప్రవ—ఓరీ! శకా ఇదియా నీ పరిహాసమునకుం గాలము. వీరా నీ పరిహాసమునకుం బాత్రులు ఛీ ఛీ చాలు. ఊరకుండుము.

సిద్ధుఁడు—వత్సా! వాని నేల దండించెదు. వాఁడే మెఱుంగు. నీకుం బోలె వానికిం సంశయంబుగలిగినది కాఁబోలు.

ప్రవ—మహాత్మా! తమయొక్క ప్రభావంబ మేయము. అనిర్వాచ్యము. ఇతరపుణ్యస్థలావలోకనంబు నాకు సాధ్యమగుం గాని హిమాచలావలోకనంబు నాకుం సాధ్యంబు గాదు.

క॥ మహితతపోమంత్రౌషధ । మహిమంబులెఱుంగ మీకు మహనీయమహా।
మహులకునను మహిమానూన్నత । మహిమాన్వితులఁ జేవికరుణము న్నింపదగుఁ ॥

(అని నమస్కరించుచున్నాఁడు.)

కలుఁడు—ఓరీ! కల మన స్వాములవారును మహనీయమహామహిమలకే ప్రారంభించిరి. మనకేమి తక్కువ.

ప్రవ—(కలునివంకఁ జూచి గద్దించుచు) ఏమీ! ఏమంటివిరా! ఓరీ!

(కలుఁడు భయపడినవానివలె నటించి లోపలికిఁ బోవుచున్నాఁడు.)

సిద్ధుఁడు—వత్సా! కోపగింపకుము. మంచిది. అనుగ్రహించెద. చూడు మీ యౌషధ ప్రభావంబు. దీని నీ యఱకాళ్లం జమిరెద. తత్ప్రభావ విశేషంబున నీవు నీ యిచ్ఛానుగుణంబుగ వాయువేగ మనోవేగంబులుగలవాఁడవై గగనమార్గంబున సంచరింప సమర్థుండవగుదువు పరీక్షింపుము.

(అని యొకానొక పసరు ప్రవరుని యఱకాళ్లం జమిరి.)

వత్సా! నేనింకఁ బోయివచ్చెద. పునర్దర్శనంబయ్యెడు.

(అని నిర్గమించుచున్నాఁడు.)

ప్రవ—ఓరీ! కలా చూచితివా! ఈ సిద్ధవరుని మహాత్మ్యవిశేషము. నే నిప్పుడ కదలి హిమాచలంబునందలి విచిత్రవిశేషంబులనెల్ల పరికించి మధ్యాహ్నకాలంబునకు మరలి వత్తును. నీ వింటికడనుండి మజ్జననీజనకుల నారయుచుండుము.

(అని ప్రవరుఁడు వెడలుచున్నాఁడు. కలుఁడును నిర్గమించుచున్నాఁడు.)

---

## ప్రథమాంకము—ద్వితీయరంగము.

హిమాచలము.

ప్రవరుఁడు—అహా! ఈ హిమాచలంబునందలి చిత్రవిచిత్ర విశేషంబులేమని వర్ణింపనగు. సిద్ధపురుషుండు వచించి నంతకన్నను శతాధికంబుగ నున్నయవి. ఇమ్మహోన్నతంబు చూడఁ జూడ నద్భుతంబై యొప్పెడి.

సీ॥ మండితబ్రహ్మాండమండపాంతరకాండ ఫ్రాద్వ్యాహ వేదికాభ్యున్నతంబు।
శృంగారితాంగనభోంగనాముకురాయమానహిమానీసమాన్వితంబు।
గంగావతరణానుషంగసోపానవిభ్రమతుంగశృంగతరంగితంబు।
భూరమణీశిరస్స్ఫురితధాతువిచిత్రరత్నకిరీటవిభ్రాజితంబు।

గీ॥ భూరి బదరీ కదంబ కేదార దారు। కాభగంగోత్తరప్రముఖాద్యపుణ్య।
వాటికారత్న పేటికా పాటవంబు। సన్నుతంబగునీహిమవన్నగంబు॥

సీ॥ కలధౌతమణిబృందకలధౌతసగమందవిమలగైరిక ధాతువిభ్రమంబు।
ఘనసారసహకారఘనసారమందారభూరుహారామాభిభూషితంబు।
శతపత్రిముఖబహుశతపత్రగధచిత్రలలితవాగమితకోలాహలంబు।
మానితామోధరమానితాంతలతాంతమల్లికావల్లికావేల్లనంబు।
భూరికాసారవారనీహారవార్య। దీరితోదారశీకరాపారసార।
సారసవిసారవిస్ఫారసౌరభాఢి। పూరధీరసమీరమీభూధరంబు॥

ఉ॥ కంటిఁగదంబకాననముకంటిఁదగన్ బదరీవనస్థలిన్।
గంటిమహావటంబుఁ బొడగంటిఘనంబగుదారుకాటవిన్।
గంటిమనఃప్రమోదజనకప్రకటాభ్రనదీప్రవాహని।
వ్కంటకబాలసైకతవిశాలవిలోలవిహారసౌఖ్యముల్॥

ఆహా! యిమ్మహాహార్యదర్శనంబున మనంబున కత్యంతసంతోషంబయ్యె. నా జన్మంబు పావనంబయ్యె. ఇంకను గలకైలాసాదిమహాస్థలంబులు రేపకడవచ్చి చూచెదన్ గాక. నేఁడు మధ్యాహ్నంబయ్యె సంధ్యావందనాదికాల్యకృత్యంబులకు వేళయతిక్రమించె. నింక నిటఁ దడయుట కార్యంబుగాదు. ఇంటికేఁగెద.

(అని, యాకాశగమనోన్ముఖుండై లేచి, పోవయత్నించుచు సాధ్యంబుగాక,)

ఆహా! యిదియేమి చిత్రము. సిద్ధౌషధ ప్రభావం బింతటితో ముగిసినది కాఁబోలు. అట్లగుటకు గారణంబు దోఁపదు.

(అని తన యడుగుల్లు చూచుకొని ఆ యౌషధంబు గానక దిగ్భ్రమనొంది చూచుచు)

అకటా! ఏమి యీ చిత్రము సిద్ధౌషధంబున్ గానము. హిమవారిపూరంబున గరఁగి పోయినది కాఁబోలు. ఇఁక నే నిల్లుచేరు నుపాయంబెద్ది. ఏ దిక్కున యే తెరవునన్ జనుదాఁడ.

(అని మూర్ఛాన్వేషియై నలుదిక్కుల చూచుచు, అలసి సొలసి.)

అయ్యో! దైవమా! ఏమి ఈ విపరీతము. సుఖంబున నేనున్న యెడకా సిద్ధపురుషుం డేల వచ్చె, వచ్చినన్ యథాశాస్త్రరీతిన్ బూజించి యతిథి సత్కారంబులు సలిపి యూరక పోవనంపక నేనేల నతని లేనిపోని ప్రశ్నంబులడిగితి. నతండారీతి నాకు వ్యామోహాకరంబులగు వాక్కుల నీ హిమాచలంబు నేల యుగ్గడించె. ఉగ్గడించిన నేమి విని యూరకుండక నే నేల యీ పుణ్యస్థలావలోకనాపేక్ష నతని కటింగించితి. యి

ప్రవరుఁడు—

క॥ మహినేద్విజుఁడను యజ్వను । బహుళతపోధికుఁడనేకపత్నీవ్రతుఁడన్ ।
గృహమేధినినుఁజైనకళ । మహిళారత్నంబకరుణమన్నింపఁదగున్॥

వరూ—ఏమి! నీవు ద్విజుఁడవా! ద్విజజన్మము కంక కాక గృధ్రాదులకు లేదా. విశేష మేమి!

ప్రవ—నేను కేవల ద్విజమాత్రుఁడనుగాను ద్విజప్రవరుండను.

వరూ—ద్విజుఁడు ద్విజప్రవరుండుగాక శూద్రప్రవరుఁడగుట యెట్లు! విశేష మేమియుం గానము.

ప్రవ—ద్విజప్రవరుండన ద్విజరాజని నా యభిప్రాయము.

వరూ—గురుతల్పగుండగు ద్విజరాజునకా యీ శంకాతంకములు.

ప్రవ—ద్విజరాజశబ్దమునకు చంద్రుఁడని నా యర్థముకాదు.

వరూ—రాజులు ద్విజులుకారా! అది యటుండని. రాజశబ్దమువలని ప్రయోజనమేమి అందుల సార్థక్యము నీకిదివరకు అలవడినదికాదు. చింతింపవలదు.

సీ॥ తవిలి పైకొనుచుఁగుంతలబలంబులలాటసీమనొక్కటఁజిక్కఁజిక్కపఱచి।
కదిసిముఖాముఖిఁగలయుచుమధురాధరోల్లసద్విభవంబుఁగొల్లవెట్టి।
పడిఁజోళమండలమొడిసితద్గుప్తధనంబునుహస్తగతంబొనర్చి।
చేయికఁగాంచికాంచీమధ్యదేశంబుఁబలుమఱుంబలయుచుబయలొనర్చి।

గీ॥ అంతనెంతయువరరుచిరాంగరాజ్య । పూజ్యసామ్రాజ్యమూర్త్యనుభూతిరీతి।
కలవడఁగద్విజరాజాఖ్యసార్థకముగ । వలరుయోగంబునీకిదెకలిగనేఁడు॥

ప్రవ—నీ వాక్కులు భావగర్భితములుగ నున్నవి. ఇందుల సంకేతితార్థమేమి! ఈ పద్యమును మఱలఁ బఠింపుము.

వరూ—మేలు. మేలు. పఠించెదఁబరికింపుము.

సీ॥ తవిలి పైకొనుచుకుంతలదళంబులలాటసీమనొక్కటచిక్కచిక్కపఱచి।

ప్రవ—కుంతల = కుంతలదేశపు, బలంబులన్ = సేనలను, లాటసీమన్ = లాటదేశమును, చిక్కపఱచి యని నీ యర్థము కాఁబోలు.

వరూ—అవును. సరె. సంకేతితార్థమెం.

ప్రవ—నాకుఁ దోఁచదు. నీ భావమేమి!

వరూ—నేను వేఱువేఱుగా నుచ్చరించు పదముల కర్థమూహింపుము. భావము తనంతటఁ దెలియవచ్చును. కుంతలశబ్దమునకు మరియొక యర్థమెద్ది!

ప్రవ—ముంగురులు.

వరూ—బలము అనుదానికి.

ప్రవ—సమూహము.

వరూ—లలాటసీమకా.

ప్రవ—నుదుటియందు = ఫాలప్రదేశమునందు.

వరూ—చిక్కువడి.

ప్రవ—(కొంత యోచించి) ఆహా! యిట్లనా నీభావము. ఇది నాకుకా బోనంగునది కాదు. ఐనను చమత్కారము గ్రహింపవలయును. తక్కిన పాదములను నిదానముగ పఠింపుము. చూతముగాక.

వరూ—(ద్వితీయచరణమునుండి మరల అదే పద్యమును పఠింపుచున్నది.)

2 కదిసిముఖాముఖిగలయుచుమధురాధరోల్లసద్విభవంబుఁగొల్లవెట్ట।

ప్రవ—ఇది మహాస్వారస్యముగ నున్నది.

వరూ—ఇది మాటలస్వారస్యము. కార్యమునందలి స్వారస్యమావల తెలియంగనగు.

3 వడిపోకమండలమొండిసితగ్గుప్తధనంబునుహస్తగతంబొనర్చి।

ప్రవ—ఇదియును అహ్లాదకరముగానే యున్నది.

వరూ—ఇదో.

4 చేయికగాంచికాంచీమధ్యదేశంబుబలిమియబలయౌచుబయలొనర్చి।

ప్రవ—ఇది బాగుగానేయున్నది. అవంతరం!

వరూధిని—

గీ॥ అంతనంతయుచిరవరాంగరాజ్య । పూజ్యసామ్రాజ్యమాత్మానుభూతిరీతి।
కలవడిఁగద్విజరాజాఖ్యసార్థకముగ । నలసరోగంబునీకిదాకలిగనేడు॥

ప్రవ—ఆహా! నీ చమత్కారము మిగుల శ్లాఘనీయము. నిను వేనోళ్ల మెచ్చవచ్చును.

వరూ—నను మెచ్చుటమాత్రమేనా నాకు లొచ్చుటే హైవం గలదా!

ప్రవ—అయ్యో! ఏల యీ భ్రమ. నేను రాజును గాను బ్రాహ్మణుడను.

వరూ—నీవు బ్రాహ్మణుడవైన నేను బ్రాహ్మణపూజ్యను నా సాంగత్యము నీకవశ్య కర్తవ్యము.

ప్రవ—నీవు బ్రాహ్మణపూజ్యవగుట యెట్లు!

వరూధిని—

గీ॥ మహితవారవశచయకుంభజనువృత్తి । కుచయుతకమధురాలా చయరుచిరయు।
వరభరద్వాజరుచిరదృగ్విభవయును । నగుటనే నెందుద్విజపూజ్యనగుటయరయ॥

ప్రవ—అమ్మహర్షుల జన్మమిప్పుడుకదా సార్థకమైనది. అయ్యో! నేను బ్రాహ్మణమాత్రుఁడను కాను. అనేకయజ్ఞములు చేసినవాఁడను. నన్ను నీ వభిలషింపవచ్చునా!

వరూ—యజ్ఞములాచరించినవారికి ఇది సహజకర్మ. దీనికి శంకింప నేల! "జ్యోతిష్టోమేన స్వర్గకామో యజేత" అని శాస్త్రము ఉండలేదా. ఈ స్వర్గసౌఖ్యమునకునై యాగములు చేయవలయునా. సర్వోత్తమమగు వాజపేయఫలము నయితము అతి సులభముగ లభింపదా. "తస్యా వేదిరుపస్థో లోమాని" అను బృహదారణ్యకోపనిషద్వాక్యమును స్మరించిన నా భావంబు నీకు గోచరంబగు ఆలోచించి చూడుము.

ప్రవ—నేను యజ్వను మాత్రము కాను. బహుతపస్సంపన్నుఁడను. నాకిట్టి పోకడ చెల్లునా!

వరూ—బహు తపస్సంపన్నుండవగుట కేమిఫలము. తత్ఫలంబు నిట నిరాయాసంబుగఁ బొందవచ్చునె. తపశ్చర్యాసక్తుండెగువాఁడు.

సీ॥ సుమనఃపదము వేట్కఁ జూచి పద్మాసనఘనవిలాసపదంబుఁ గాంచవలయుఁ।
గాంచి చొక్కుచు విశంకటగిరీశవిలాసపదసుఖానుభవంబుఁ బడయవలయు।
బడసి తోడనె విష్ణుపద మొందితత్సుధాసరసిసంభావనసలుపవలయు।
సలిపి యాత్మారామసౌఖ్యదంబగు నన్యజపథానుభవంబు నందవలయు।
గీ॥ నందియొందును పరమహంసాతిశయము । విభ్రమాస్పదపదము సేవింపవలయు।
నన్నియును నిందు నాయందు నమరియుండు । బొందుమా నన్ను బ్రహ్మైక్య మొందఁగలవు॥

ప్రవ—ఈ పరమపదములన్నియు నీయందమరియుండెట్లు!

వరూ—శ్లేషార్థముల ననుసరించియు, ఉపమానవాచకముల ననుసరించి, యుపమేయపదార్థముల నూహించియు, పద్యార్థమును గ్రహింపుము. నాభావము వ్యక్తము కాఁగలదు.

ప్రవ—ఏది! మఱల ఆపద్యమును నిదానించి పఠింపుము. యోచించి చూచెద.

వరూధిని—

సీ॥ సుమనఃపదము వేట్కఁ జూచి పద్మాసనఘనవిలాసపదంబుఁ గాంచవలయు।

ప్రవ—సుమనః = దేవతలకు, పదము = స్థానము, అనఁగా స్వర్గమును జూచి. పద్మాసన=బ్రహ్మయొక్క ఘనవిలాసపదంబు = అధికవిలాసస్థానమగునది. అనఁగా సత్యలోకమును గాంచవలయునని యర్థముగాఁబోలు.

వరూ—అవును. సరె. అవి నాయందెచట నున్నయవి.

ప్రవ—నీభావమేమియో నాకుం దోఁచదు. నీ యర్థమును సమర్థించు టెట్లు.

వరూ—నీవంటి శుద్ధవైదికునకది స్ఫురించునదికాదు. జ్ఞానోపదేశముఁజేసి స్ఫురింపం జేసెద.

సుమనః = పుష్పములకు, పదము = స్థానము. ఏది?

ప్రవ—కొప్పు కాఁబోలు.

వరూ—అవును సరి. కమలాసనఘనమానసపదంబు—అనఁగా—కమలములను దిరస్కరించు నట్టి యధికవిలాసమున శాస్పదమగు స్థానమేది.

ప్రవ—ముఖము కాఁబోలు.

కమలాసనశబ్దమునకు—కమలములను దిరస్కరించు. అను అర్థమెట్లు?

“అసు క్షేపణే” అను ధాతువు ననుసరించి చూడుము.

ప్రవ—సరి. ఉండవచ్చును.

వరూ—ఇతరత్ర యిట్లనె యూహించిచూడుము.

ప్రవ—ఏది. నిదానముగ పఠింపుము.

వరూధిని—

2 గాంచిచొక్కుచువిశంకటగిరీశవిలాసపదసుఖానుభవంబుఁబడయవలయుఁ।

ప్రవ—గిరీశపదవిలాసము చో—కైలాసమనియు, ఉరోజమనియు, అర్థద్వయము కాఁ బోలు.

వరూ—ఆహా! సరి - సరి. అట్లకదా స్వారస్యమును గ్రహింపవలయును.

3 పడసితోడనవిష్ణుపదమొందితత్సుధాసరసీసంభావనసలుపవలయు।

ప్రవ—విష్ణుపదమనఁగా = వైకుంఠము, ఆకాశము. ఇందు ఆకాశమను ఉపమానమునకు ఉపమేయము—నడుము. అందలి సుధాసరసియనఁగా = అమృతసరోవరము. అనఁగా నాభి. ఇదికదా, నీయాశయము.

వరూ—అవును. ఆహా! మేలు మేలు. ఇటులకదా నాభావమునుగ్రహించి వామార్గ మునకు రావలయును. దీని నాలకింపుము.

4 నలిపియాత్మారామసౌఖ్యదంబగుననన్యజపదానుభవంబునందవలయు।

ప్రవ—స్వర్గ, సత్య, కైలాస, వైకుంఠ లోకములన్నియు సార్థకములైనవి. ఇదేమి. (కొంత యోచించి) ఆత్మారామసౌఖ్యదంబగు ననన్యజపదమనఁగా, తనలో తాను రమింపు చుండునట్టి సౌఖ్యమునిచ్చు స్వహృదయస్థితి యనియు, నిది, యా, స్వర్గలోకాది సౌఖ్యముల నతిక్రమించినదనియు నుండవచ్చును. మఱి యొక యర్థమున ననన్యజ శబ్దమునకర్థము స్ఫురింపలేదు.

వరూ—వైదికజాడ్యము వదలినఁగాని అది యెట్లు స్ఫురించును.

« శంబరారిర్మనసిజః కుసుమేషురనన్యజః” అను శబ్దార్థముల ననుసరించి విచారించిన నా యర్థము వ్యక్తము కాఁగలదు.

ప్రవ—అట్లనా (అని యోచించి) ఛీ! ఛీ! చాలు. చాలు. ఇంక చాలింపుము.

వరూ—పూర్తిగాఁ బఠించికదా. చాలింపవలయును. గమనింపుము.

గీ॥ *అందియొంచును పరమహంసాతిశయను । విభ్రమాస్పదపదము సేవింపవలయు।

ప్రవ—ఇందు పరమహంస పరివ్రాజకస్థితిని బొందుటయని యర్థము. మఱియొక యర్థమున శ్రేష్ఠములగు హంసపక్షుల్ల విలాసమున కాస్పదములగు పాదములను సేవించుటయని నీ భావము కాఁబోలు. సరి సరి. నీ భావార్థము ననుసరించినవానికి నీ పాదసేవగాక మఱియేమి కలదు. అయ్యో! కాలాతీతమగుచున్నది. ఈ శ్లేషార్థ చమత్కృతులెందుకు చాలించరాదా.

వరూ—ఈ శ్లేషార్థములు భవదాశ్లేషార్థముగాక మఱియెందుకు.

ప్రవ—అయ్యో! నేను గృహస్థుండను. ఏకపత్నీవ్రతుఁడను. నాయాశ్లేషాదులను నీవభిలషింపవచ్చునా.

వరూ—నీవు గృహస్థుగాని, బ్రహ్మచారివి కావుగదా. అది కొంతమేలు. ఏకపత్నీవ్రతుఁడంటివి. నూటయిరువది యెనమండ్రు భార్యలుగల శ్రీరాముఁడు ఏకపత్నీ వ్రతుఁడు కాఁడా. వేనవేలు భార్యలు గలిగియు స్వేచ్ఛగా వ్యభిచరించిన శ్రీకృష్ణుఁడు అస్ఖలితబ్రహ్మచారి కాఁడా.

ప్రవ—వారు మహనీయులు. నేను మనుష్యమాత్రుఁడను. నాబోఁటివానికి పరస్త్రీ సాంగత్యము చెల్లునా.

వరూ—నేను పరస్త్రీని కాను. స్వేచ్ఛందవృత్తిగలదానను. నాసాంగత్యమువలన నీకుం దోషంబు రాదు. తానుగావరించి వచ్చిన స్త్రీని పరిగ్రహించుట సద్వ్రతంబని «న కాంచన పరిహారేత్” అను ఛాందోగ్యోపనిష ద్వాక్య మెఱుంగవా.

ప్రవ—అయ్యో. స్త్రీ శూద్రులకు వేదపఠనీయము. నీవు స్త్రీవయ్యు నట్టివాక్యములను బలుమాఱు నుచ్చరింపవచ్చునా.

వరూ—నేను వేదమును బఠించినదానను కాను.

ప్రవ—మఱి యీ వేదవాక్య పరిచయ మెట్లు.

వరూ—తపోయజ్ఞాదికార్యదక్షులగు మహామహులనేకులు స్వర్గమున మాయిండ్లకడ వంచలంగూర్చుండి మా కృపాకటాక్షవీక్షణంబులకై గోరుచు, అతిశీఘ్రంబునకై సమతూరక ప్రొద్దుపోక పూర్వపరిచయునాననాని శేషంబున పదరు చుండుట పలుమాఱు వినియుండుటంబట్టి సందర్భానుసారముగనవిస్ఫురించినవి. ఇందువలన దోషమేమి!

ప్రవ—తపోయజ్ఞాదికార్యదక్షులకు లభించు సౌఖ్యమా యిది. ఇట్టిది నాకువలదు.

వరూ—“ అవశ్యమనుభోక్తవ్యంకృతంకర్మశుభాశుభం” అనుటఁబట్టి తపోయజ్ఞకార్యదక్షుండవగు నీ కిదియెట్లు తప్పును.

ప్రవ—మరణానంతర మేయేగతులు సంభవించునో! అటుండని. ఇప్పుడే వ్యభిచరింపవచ్చునా. వ్యభిచారము మహాపాపకరంబని వినుచుండుదు.

వరూ—ఏమి! స్వైరలగు నప్సరస్త్రీలకైగూడి సంభోగసౌఖ్యమందుట వ్యభిచారమా! ఆశించినవారిని విడనాడుట పాపము కాదా! వంచించి పరాంగనలంబొందుట పుణ్యంబు కాఁబోలు. ఇట్టి పనులొనరింపని వారెవరు.

సీ॥ తులసీవధూమణితోరమించినమహామహుఁడునారాయణుమహిమమెల్ల।
దారుకావనమానిదారకాముకుఁడగునాదిశంకరునిమహత్వమెల్ల।
తాఁగన్నశారదాతరుణిఁగూడినముదిబ్రహ్మభవ్యమహానుభావమెల్ల।
ప్రాకటంబుగనహల్యాకాముకుండగుదేవేంద్రునిమహాప్రతిష్ఠయెల్ల।
గీ॥ పూనివచియింపగురుచంద్రబుధసమీర । శమనపావకులొనరించుచర్యలెల్ల।
కన్నవియువిన్నవియుఁగాకెకామితార్థ । సాధకులుగాకవారలుసాధుమతులె॥

ప్రవ—అయ్యో! వారలు దేవతలు. విగ్రహానుగ్రహసమర్థులు. వారలవలె నితరులాచరింపకై చెల్లునా.

వరూధిని—

శా॥ విశ్వామిత్రపరాశరప్రభృతులావిఖ్యాతమోహాంధులై।
శశ్వత్కాముకలీలనన్యవనితాసంభోగముల్గాంచుటే।
విశ్వంబెల్లయెఱుంగదేతదధికానేలాతతస్వర్గసా।
మ్రైశ్వర్యంబులభింపఁద్రోయుదురెయాహావారుసామాన్యులే॥

ప్రవ—వారు సామాన్యులుకారు; గనుకనే అట్టికార్యములు వారికికై చెల్లినవి. నను బోంటి సామాన్యునకిది పొసఁగునా.

వరూ—సామాన్యమానవులకైననో,

సీ॥ ఆలోకనార్థపదార్థోత్తమం బెద్ది భామాముఖాబ్జబింబంబు గాదె।
శ్రవణార్థమంజులశబ్దరాజం బెద్ది తరుణీవచోనినాదంబు గాదె।
ఘ్రాణార్థమహనీయగంధతల్లజ మెద్ది ప్రమదాతనూసౌరభంబు గాదె।
రసనార్థవరరుచిరసవత్తమం బెద్ది శ్యామాధరసుధారసంబు గాదె।

గీ॥ సతతసర్వాంగతోషణసౌఖ్య మెద్ది।

ప్రవ—చాలుచాలు, ఈతుచ్ఛసుఖంబులు కాముకుఁడగు వానికిఁ జెల్లుఁగాని, అకాముకునకుఁ జెల్లునా.

వరూ—అకామునకు మాత్రము.

సంప్రవర్ధితసకలసంసారదుఃఖ।

ముక్తికాంతాసమాయోగముఖ్యసౌఖ్య। కలనమగుఁగాక మతి వేఱుకలదె చెప్పుమ॥

ప్రవ—అయ్యో! ఇట్లు చెప్పవచ్చునా. సంప్రవర్ధితసకలసంసారదుఃఖముక్తికాంతాసమాయోగమనుచో వృద్ధినొందిన సమస్తసంసారదుఃఖమోచనము నిచ్చునది కాంతయనియును; ఖండింపఁబడిన సకలసంసారదుఃఖములుగల ముక్తికాంత యనియును; చమత్కారమా! ఇదియా అముక్తికాంతకువచ్చిన పాటు. అహా! యేమియీవింత; మానవులైననేమి. వారికి సంతోషాస్పదములగు యితర సత్క్రియాకలాపము లెవ్వియు లేవా! నీవే మెఱుంగుదువు.

ఉ॥ బాష్పరితయేల ప్రేలెదిటు పల్లవపాణి రో చాలుచాలునీ।
పాపవచఃప్రసక్తి తెలుపన్ దెలియన్ దరమే తలంచినన్।
రేపుమమాపుహవ్యములదృప్తివహించుచుపావకుండు సం।
తాపములార్చి కూర్చు వివిధప్రథితప్రబలప్రమోదముల్॥

వరూ—ఎటుదూచినను ప్రమోదమేకద, అపేక్షణీయము. అది యిట సమగ్రంబుగఁ గలదు.

ప్రవ—మరణానంతరంబున లభించు దేవత్వాదులెట్లు కలుగును.

వరూధిని—

ఉ॥ ప్రాకటయజ్ఞముల్ బహుజపవ్రతముల్ సురతాసుభూతికిన్।
గాకను కేమియంతనవికల్పలోకల్గవో రేల సంశయం।
బీకమనీయరూపమిటు లేటికలంచెదు చాలుచాలున।
స్తోకముగాఁగ నేనొసఁగుదున్ ద్విగుణంబుగ దానిరమ్మికన్॥

ప్రవ—ఏమి సురతానుభూతిని ద్విగుణంబుగ నిచ్చుచున్నావా! ద్విగుణమున కేమి చమత్కారము.

(కొంతయోచించి)

ఆహా యిట్లనా సురతానుభూతికి దేవత్వానుభవమని, సంభోగానుభవమని అర్థద్వయము కాఁబోలు. ఇట్టి సురతానుభూతి నాకువలదు. ప్రొద్దు పోవుచున్నది. మార్గంబు తెలుంగులుంగం జెప్పి నన్నుఁ బంపుము. నీవాక్చాతుర్యమునకు లోఁబడి అనూచానంబగు సద్వృత్తంబు విడనాడఁజెల్లునె. ఏల యీభ్రాంతి.

వరూ—సద్వృత్తంబును విడనాడుమని నేను చెప్పను. సద్వృత్తస్వరూపవగు నన్నుం బొందుమని మాత్రము ప్రార్థించెద.

ప్రవ—నీ వెట్లు సద్వృత్తస్వరూపవు.

వరూధిని—

సీ॥ సరసిజమృదులతాస్పదపాదవిభ్రమమత్తేభవిలసితమందయాన।
మానితవిపులపృథ్వీనితంబాభోగకోమలమంజరీకుచవిలాస।
మత్తకోకిలమహామధురవాగ్వైభవరుచిరోత్పలాయతారూఢనేత్ర।
కమనీయశుభవృత్తమంగళమహాశ్రీకర్ణమేఘవిస్ఫూర్జితామోఘవేణి।
గీ॥ సురుచిరాంచితచంపకసురభిళాంగి । మంజుతరచంద్రికాసాంద్రమందహాస।
వగుచు వలరాను నేనెందు నలరనేని । రూఢి గాంచు సువృత్తస్వరూపవనఁగ॥

ప్రవ—ఇదేనా నీసువృత్తశబ్దార్థము. ఇంతగాక మఱేమి యుండును. నీవు మహాప్రౌఢవు. నీనైపుణ్యమగణ్యము. నీ బుద్ధిని సన్మార్గమునందుఁ బ్రవర్తింపఁజేయక యిట్లు వృథాప్రయాసము సేయుట యుక్తము కాదు. చాలింపుము.

వరూ—నీవంటి సత్పురుషులకెకులు బహుకాలము మహాయాసంబునఁ బడయంగల స్వర్గసౌఖ్యాదులను శీఘ్రకాలంబున నిరాయాసంబుగ లభింపంజేయు మహోపకారంబునకన్న శ్రేష్ఠతరంబగు సన్మార్గావలంబన మెద్ది.

ప్రవ—ఇట్టి నీవొనరించఁగల మహోపకారము నేనపేక్షింపను. కేవలదవచ్చి పుణ్యతీర్థావలోకనంబు సలుపవలయునను అభిలాష నాకుంగలదు. నేఁడు ననుంగరుణించి శీఘ్రంబునం బంపుము.

వరూ—పుణ్యతీర్థంబుల నన్వేషించుచు పోవలయునా అవి యిటలేవా.

ప్రవ—ఇటఁగలవాని నెల్ల నేఁడుచూచితిని.

వరూ—ఇంకను అనేకములుఁ గలవు. అవియును నాయందె యున్నయవి.

ప్రవ—అదియెట్లు.

వరూధిని—

సీ॥ తరళగంగాభంగధవళదృగ్విభ్రమయమునావినీలదృగ్విమలశోభ।
సరససరస్వతీవరవచోవైభవలాలితనర్మదాలాపకలిత।
భాసురాంచితచంద్రభాగామలకపోలశోభితశోణాధరాభిరామ।
సురుచిరతుంగాతిసుందరకుచయుగ్మమానితభద్రాసమానయాన।
గీ॥ విశ్వవిశ్రుతమహాకృష్ణవేణి వేణి । మతియుక్షీరాభిమండితమందహాస।
గాంగబహుపుణ్యతీర్థసంగ్రహనిరూఢ । గాంగభావింపవగునన్ను ఘనత నెపుడు॥

ప్రవ—పుణ్యతీర్థముల కింత సుంగళారతిచాలు. అయ్యో! ఇంక నేమి వినవలసియున్నదో. స్త్రీలు సామాన్యలా కారు.

వరూ—సామాన్యలెందు కగుదురు. యుక్తాయుక్తవివేచనజ్ఞానములేక కేవల ద్రవ్యార్జనంబు నందుమాత్రము ఆసక్తిగలవారలై పురుషులం బొందువారు సామాన్యలనంబడుదురు. అట్టివారు గాక నాబోంటి సమస్తవేదశాస్త్రస్వరూపులును, బ్రహ్మానందప్రదాయకలును అగు స్త్రీలు సామాన్యలగుదురా.

ప్రవ—స్త్రీలు సమస్తవేదశాస్త్రస్వరూపులగుట యెట్లు. బ్రహ్మానంద సంధాయకులగుట యెట్లు. ఏల యీగర్వము. ఏల యీపాపవాక్యప్రసంగము.

వరూధిని—

మ॥ అనయంబుం దరహాసవిభ్రమము చంద్రాలోకసౌభాగ్యభా।
జనమంచుం గుచసౌష్టవంబు రసమంజర్యాయుతాహ్లాదసం।
జనకంబంచు సుశ్రోణి యాకువలయానందానుభావోదయం।
బనుచుం ధాత్రి రసజ్ఞులెంచ సతి యాసామాన్య గాకుండునే॥

ప్రవ—అలంకారశాస్త్రముల కేమి. అవి యెటులనైన నాకేమి.

వరూధిని—

క॥ గురుకుచచంద్రాననసిత । దరహాసవిలాససౌమ్యదర్శనరక్తా।
ధరమందగమనసువిభా । కరభూషణయగుటనాలిగ్రహమయి గాదే॥

ప్రవ—అయ్యో శాస్త్రగ్రహములారా! మీదుర్దశ మతియెవరికిని వచ్చినది కాదు. మీశోదన సంఖ్య మిమ్మింతకుఁ దెచ్చె.

వరూధిని—

క॥ ఘననాభీకటుల్యారు । స్తనముఖకచదర్శనం బెసదమలపద్మ।
ర్శనమహిమనలరవనజా । ననశాస్త్రిజ్ఞానసాధనంబగుటరుదే॥

ప్రవ—“నదీనాంసాగరోగతిః” ఇంకశాస్త్రముల చింతయెందుకు.

వరూధిని—

క॥ ననుఁగూడినిన్ను మగచుట । వినుమది వేదాంతమనఁగ వెలయున్ శ్రుతినీ।
వనయము నాకడనుండుట । జనునదిపరికింపను పనిషద్విద్యయనన్ ॥

ప్రవ—అది వేదాంతము కాదు. వేదమునకు అంతము అనఁగా నాశనము. ఇవి మహాకర్ణ కఠోరములు ఇంక సహించుట ప్రయాస.

వరూధిని—

గీ॥ భవ్యకమలాననవిలాసభాసమాన । నయనయుగవిధుముఖియుంకనగిరీశ।
కుచయుగునింతినంతతాకుంతమహిమ । అలత్రిమూర్త్యాత్మకస్థితినలుగఁగాదే॥

ప్రవ—(చెవులుమూసికొని) రామ రామ శ్రీహరీ.

వరూధిని—

క॥ ఆనంద మెబ్రహ్మంబని । పూనిశ్రుతుల్ వలుకఁగా దెపొందుమునమని।
త్యానందపూర్ణసుఖస । మ్మానితిబ్రహ్మైక్యమహిమమానకకలుగున్.

ప్రవ—అయ్యో ఏమి నాతలవ్రాత. ఎట్టి పాప వాక్కులు విననోఁచితి. ఇంక సహింప వచ్చునా.

సీ॥ ప్రాజ్యప్రపూజ్యసాయుజ్యసామ్రాజ్యసంప్రాప్తిదంబగుమహాబ్రహ్మవిద్య।
హృద్యవిజ్ఞానప్రపాద్యానవద్యమై యాద్యమానట్టి వేదాంతవిద్య।
మహిమాణిమాగరిమాముఖాఖిలమహాభోగాభియోగమాయోగవిద్య।
నిఖిలతత్త్వరహస్యనిర్ణయస్వాతంత్ర్యసాధకంబగునట్టిసాంఖ్యవిద్య।
గీ॥ ఆహహామతియును బ్రహ్మకర్మైక్యభావ । మహిమఘోషించు మేటిమీమాంసవిద్య।
లన్నియునువ్యర్థములునీమహాప్రసాద । సాధ్యసంభోగమొక్కటిసార్థకంబు॥
క॥ ఈపగిదిశాస్త్రపద్ధతి । పాపంబనిరతియపుణ్యఫలమని తెలియన్।
రూపింపఁగంటినహహా । ఈపాండిత్యప్రభావమేమనవచ్చున్॥

ఇంక నీతో వాదించుటవలనఁగాని సంభాషించుటవలనఁగాని ప్రయోజనంబగుపడదు.

ఉ॥ పొమ్మిదె త్రోవయుండుననబోణిరొమాపుముచాలునట్టెకం।
కిమ్మనకేగువాఁడనుడికింపకుననిన్నికవట్టిదుష్ప్రిలా।

పమ్ములమార్గమారయు నేపమ్మునరాను నిజమ్ముత్రోవచం।
దమ్మితీఁగించినన్ను పుతక్క్రనలేదను మేనపోయెదన్॥

వరూ—(బలాత్కారంబునఁ జేతులుపట్టుకొని)

శా॥ ఆహాయేమనవచ్చునీచెడుగుమౌర్ఖ్యంబోమహాభాగనే।
బాహాబాహిఁబెనంగినన్ వినవు సంభావ్యంబుగాదిట్టినీ।
యూహాపోహవిచారమీయెడననాహూయంబుగా సౌఖ్యసం।
దోహంబీగతిలభ్యమైయుదుగ నెందున్ ద్రోచిపోవచ్చునే॥

ఉ॥ నీమహితాభిరూప్యమును నీనవయౌవనభాగ్యరేఖయున్।
నీముఖమంజులాకృతియు నీరుచిరాంగకళావిలాసమున్।
నీమహనీయనవ్యకమనీయమహాప్రతిభానుభావమున్।
నామది నాఁటెమారుఁడిదె నాఁటెసుమాస్త్రముహుఃపరంపరల్॥

ఉ॥ ఓనవమోహనాంగ భవదుత్తమసుందరరూపమున్ భవన్।
మానితయౌవనంబును సమంచితసౌరతసౌఖ్యవార్ధిలో।
మానిన ప్రేమదేల్చ కిటులూరకవ్యర్థముసేఁతమానులున్।
మానసవీథి మెచ్చరనుమానము మానుమెఱుంగఁజెప్పితిన్॥

శా॥ మానాస్త్రిప్రతిమాన నావలపు నంసూచించితిన్ మాటికిన్।
దీనాలాపములన్ మదీయహృదయోద్దేశంబు మన్నించినా।
నానావ్రమదప్రపాదకమనోవ్యాసక్తిసంభోగసౌ।
ఖ్యానందాంబుధిఁదేల్చెదో విరహదుఃఖాగ్నిచ్ఛటన్ గూల్చెదో॥

శా॥ నానామానవితానమాలికలు నానాసౌరభద్రవ్యసం।
తానంబుల్ వివిధాంబరాభరణబృందంబుల్ సుధాస్వాదుభ।
క్ష్యానీకంబులనేకముల్ గలవు నిత్యాభోగసంభోగసౌ।
ఖ్యానందాంబుధి నోలలాడుదము రమ్మా గోలయీచందముల్॥

ప్రవ—(చేతులువిడిపించుకొని) అయ్యో! దైవమా ఏమినాతలవ్రాఁత. ఇదియేమి అన్యాయము. ఇంక నిటనుండుట తగదు. మార్గంబు నెఱుంగ నుపాయాంతరంబు చింతింప వలయు. నేన పోయి యన్వేషించెదంగాక.

(అని వెడలిపోవ నుద్యుక్తుఁడు కాఁగా)

వరూ—(శ్రోవకడ్డంబుగా నిలువంబడి.)

మ॥ నినుఁబోనివ్వను రావనుక్ విడకు రానీ మోహా నాకారయా।
వనలావణ్య విలాసముల్ మనమునక్ వ్యామోహమెుందించెరా।
వినరా తాళఁగలేను రామరుఁడు దావేమాఱునన్నొంచెరా।
మనమారన్ ననుఁగౌఁగిలించి రతిసమ్మానించి రక్షింపరా॥

ఉ॥ మాన్య పురందరాది సురమానిత వారవధూజనైకమా।
ర్ధన్యను రూపశీలగుణధన్యను సంతత సుప్రశస్త సా।
జన్యను నాకసౌఖ్య చతుజన్యను దైన్యమునన్ మనుష్య సా।
మాన్యుని నిన్ను నిట్లు బతిమాలుట హైన్యముగా దెచూడరా॥

ప్రవ—నీ దైన్య హైన్యములు దేవుఁడెఱుంగు. నేవిచారింప నొల్ల. అయ్యో! నాతలవ్రాఁత ఈ రారాపోరాలా నాయోగ్యతకు. నా జన్మంబు సార్థకంబయ్యె. ఇంత చాలు. (వరూధిని వంకఁ జూచుచు) నీవు నాకసౌఖ్య చతుజన్యవనుట సత్యము. ఎటు చూచినను నీవు నాకు ఆ సౌఖ్య చతుజన్య వనుటకు సందేహము లేదు. ననుబోఁటి వానికివి చెల్లునా.

సీ॥ విపుల పాపాటోపవిస్మా త్రికూపంబు మానిత పుణ్యాదవానలంబు।
దాంపత్య వైమనస్యలతాలవాలంబు ఘోరరోగాసార వారిదంబు।
శంకారహితసాహసాంకుర బీజంబు బహుళ లజ్జావార్ధి బాడబంబు।
వివిధాపవాదాగ్ని వృద్ధి కృత్పవనంబు పాత్రతావల్లీలవిత్రకంబు।

గీ॥ ద్యూతమధుపానచౌర్యాది దుష్క్రియాస । మూహనానామహీరుహదోహదంబు।
గాదె వ్యభిచార కార్యంబు కాంత వినుము । వ్యర్థమింతయు నీదు సంప్రార్థనంబు॥

పురుషులకు పర స్త్రీలయెడ మాతృభావనం బవశ్యకర్తవ్యంబు గావున.

శా॥ అమ్మా బ్రాహ్మణజన్మమెత్తితగు గావ్యస్వస్థితిక్ బొల్చిని।
త్యమ్ముక్ ధ్యానజపవ్రతార్చనతపోయజ్ఞాది కార్యమ్ములక్।
సమ్మానంబువహించి నీకునయియా సర్వమ్మువో నాడన్యా।
యమ్మా నన్విడనాడి పుణ్యమునఁబోవమ్మా యిదే మ్రొక్కెదక్॥

వరూధిని—

క॥ అమ్మా యనఁబోకుమునను । కొమ్మా యధరామృతంబుఁ గ్రోలఁగనిటురా।
రమ్మా బహువిధరతిబం । ధమ్ములఁగరఁగింతు మదిముదమ్మునఁబొదలక్॥

అకటా ఏల యిూ యాలస్యము.

సీ॥ తుంగాగ్రహర్మ్యాంతరంగాత్తసురతప్రసంగాంగసంశ్లేషసంభ్రమముల।
లీలాగృహోద్వేలడోలాసమాలోలవేళానుకూలానులాలనముల।
వామాసమారామసీమావిహారాభిరామావిరామనర్మక్రమముల।
నానానవమువాగ్విధానానుతమనోనవీనానురాగాతివిభ్రమముల।
గీ॥ సరసనికటదరీఝురీస్నానవిధుల । సారతరగాంగసైకతచంక్రమముల।
మంజులనికుంజపుంజానురంజనముల । నేలుమిఁకచాలు నేఁతాళఁజాలనకట॥

క॥ రారాగాఢాలింగన । మీరా నను మోవియాననీరామారా।
కారావందనమిదెకై । కోరాయిఁకచాలు నేలికోరానన్నున్॥

(అని బలాత్కారంబున నాప్రవరునిన్ గౌఁగిలించి వాని మోవి ముద్దిడనుంకించుచున్నది.)
ప్రవ—(ఛీ ఛీ! యని యా వరూధినిన్ దొలఁగన్ ద్రోయును.)

ఉ॥ శ్రీహరిశ్రీహరీహరిహరీయిదియేతగులంబునాకునే।
డీహరిణాక్షిబారిఁబడియిల్లుతపింపఁగనెట్టిపాపసం।
దోహమొనర్పఁజాలితినొ తోరపుదుర్దశఁజిక్కియింతఁగా।
నోహటిలంగఁగంటినయయోవిధి నేమనిదూరఁగానగున్॥

శా॥ ఈకాలంబుననీహిమాద్రిపయినిట్లేకాకినైయీమహా।
కీకారణ్యమునందునీకరణిశోకింపంగనాఫాలమం।
దాకంజాతభవుండువ్రాయనగునాహాయట్లుఁగాకుండినన్।
పాకారాగతమృత్యువున్ దొరయునీచంద్రాస్యనన్నేఁచునే॥

శా॥ అయ్యోదైవమతల్లిదండ్రులునుభార్యాపుత్రులున్ డెందముల్।
ప్రయ్యన్ గుయ్యిడుచుండనియ్యడవితీవ్రంబైనదుఃఖంబునన్।
గుయ్యాలించెడువారిఁగానకిటు నేఘోషింపఁగంటిన్ గదున్।
కుయ్యంబారఁగనన్నుబ్రోవుమువినిర్నిద్రానుకంపాకృతిన్॥

(అని అంతరిక్షంబు చూచుచు నిశ్చేష్టితుండై కొంతతడవుండి యే సహాయంబును గానక యూరకుండి యనంతరంబున.)

క॥ అహోనినుమఱచితినో । స్వాహానాయకప్రమోదసంధాయకవ్యా।
మోహవిదారకభువనస । మూహవిధాయకనమోనమోనినుఁదలఁతున్॥

క॥ నీవత్రిమూర్త్యాత్మకుఁడవు । నీవజగద్వ్యాపకుఁడవునిఖిలాత్ముఁడవున్।
నీవనినుసర్వమునుగా । భావించున్ శ్రుతులులోకపావనచరితా॥

చ॥ అనయమునీపదాంబుజములంచితభక్తిభజింతు నేనిపా।
వనగుణసత్యశీలములవారిగఁ బూనినవాఁడ నేనియా।
దినమునభానుఁడస్తగిరిదిక్కునఁ గ్రాలకమున్న సాగ్రహం।
బుననను( జేర్పుమోనిఖిలభూతచయావనహవ్యవాహనా॥

(అని స్తుతియించి తత్ప్రభావవిశేషంబున గగనమార్గంబున నిర్గమించి వెడలిపోవుచున్నాఁడు.)

ప్రథమాంకము—సమాప్తము.

---

శ్రీరస్తు.

# స్వారోచిషము.

## ద్వితీయాంకము—ప్రథమరంగము.

[వరూథినిమణిమందిరము.]

వరూథిని—(ప్రవరుండాతీరున వెడలి చన్న పిదప మూర్ఛపడిలేచి యేడ్చుచు.)

ఉ॥ అచ్చుగ నామనంబున మహాశ జనింపఁగ మాటిమాటికిన్।
ముచ్చటలాడియాడి తుదమూర్ఛితమూడిన మానసంబునన్।
హెచ్చినతాల్మి నన్విడిచి యేగె మదీయమనఃప్రమోదపా।
టచ్చరుఁడింక వానినకటా యెటనారసి కాంచుదాననో॥

సీ॥ రమ్యాననము వాఁడు రతిరాజఋతురాజరూపకోమలతానిరూఢివాఁడు।
వరవిభాయతి వాఁడు గిరిరాజహరిరాజసమధికస్థైర్యధైర్యములవాఁడు।
దివ్యవైఖరి వాఁడు దినరాజఘనరాజమహితతేజఃకళామహిమవాఁడు।
స్ఫురదురస్స్థలి వాఁడు సురరాజనరరాజదమితసంపద్విలాసములవాఁడు।

గీ॥ నిగ్గుగలవాఁడు రుచిరంపునీటువాఁడు। టెక్కుఁగలవాఁడు జగజంపుఠీవివాఁడు।
నెఱికురులవాఁడు వలపులు నెఱపువాఁడు। ననుమరులుగొల్పి మాయమైచనియెనేఁడు॥

మ॥ హరతేజోవిభవాభిరాముఁడు సముద్యద్దివ్యదైతేయనం।
హరణీకాశవికాసభాసురుఁడు హృద్యానూనవాణీమనో।
హరవిద్యాప్రతిభానుభావుఁడు మదీయస్వాంతమున్ బల్మితో।
హరలీలాయతిఁదాహరించి మటుమాయం బయ్యెనింకేమనన్॥

వ. మార్గాన్వేషినైయొకదా యిటవచ్చితినని వాఁడు వక్కాణించె. వానికామార్గంబుఁ జూపువారెవరు. ఈమధ్యాహ్న కాలంబున నకనకంబడు నాఁకటన్ బడి డస్సి యున్నవాఁడిపుడెందుఁ బోఁగలఁడు. మన్మణిమందిరప్రాంతదుర్గమారణ్యంబున సంచరించుచుండవచ్చునని తోఁచెడి. పోయి యారసి చూచెదంగాక.

(అని వనంబున నటునిటుఁ గ్రుమ్మరి యెందునుంగానక.)

వ. ఏమియీవిచిత్రము. ఆమహామహుండెందునుం గనరాఁడయ్యె. నిందుఁగలవనంతా దులనడిగి చూచెదంగాక.

ఉ॥ పావనభూసురాన్వయవిభాసియొ కానొకఁడస్మదీయుల|
జ్ఞావిభవంబుఁగొల్లగొని చయ్యననీవనవీథివచ్చెనీ|
పావనజాతనేత్రునిసమంచితగాత్రునిఁ గాంచియున్నసం|
భావనఁ దెల్పుమా వనరమాధవమాధవ నిన్ను వేఁడెదన్॥

సుగంధి॥ అంగజాభిరూప్యదీప్యదంగసౌష్ఠవప్రభా|
భంగమంగళస్వరూపభాసమానుఁడస్మదు|
త్తుంగధైర్యవిభవమెల్లదోఁచెవానిమీరుసా|
రంగమారథాంగమాకురంగమాయెఱుంగరా॥

ఉ॥ భూరివిశాలవక్షుఁడు ప్రఫుల్లసరోజదళాక్షుఁడొక్కఁడీ|
తీరువనన్ను మోహజలధిన్ బడఁద్రోచితొలంగెనాతఁడీ|
దారిఁజనంగఁ గాంచరుకదా పికకోకమయూరశారికా|
కీరములార నాదుమదికిన్ ముదమార నెఱుంగఁజెప్పరే॥

ఉ॥ భృంగమ కానవా వరసమిద్ధసుకాంచనసన్నిభాంగుమా|
తంగమ కానవా కనదుదారమహామృగరాజమధ్యుచ|
క్రాంగమ కానవా ఘనఘనాంబుదనీలశిరోజునిం దునా|
సంగతియాత్మకింపయిపొసంగమిఁగన్ను మొఱంగెనివ్వనిన్॥

(అని చెవియొగ్గి వినుచు కొంతసేపూరకుండి.)

వ. అయ్యో! ఏమిసేయుదు. ఎవ్వరుం బలుకరే. ఆపత్కాలంబునఁ గరుణించి తోడు పడునట్టి సహజ సౌజన్యమాన్య ధన్యులగు వారెవ్వరునుం గానరైరి. ఇంక తరులతాదులనడిగి చూచెదంగాక.

ఉ॥ లాలితరూపయౌవనవిలాసవిభాసురుఁడొక్కఁడస్మదు|
త్తాలహృదంతరాళగతధైర్యనిధిన్ వెసఁదస్కరించియు|
ద్వేలగతిన్ గిరిన్ విపినవీథిఁబలాయితుఁడయ్యెఁగానరా|
సాలరసాలతాలతరుజాలములార యెఱుంగఁజెప్పరే॥

*క॥ చంద్రసుచిసురుచిరానను । చంద్రరుచిస్మేరచారుచక్షువిలాసున్ ।
చంద్రసుచితనువికాసుని । చంద్రమయిటఁ జూపుఁడసమచంద్రుని నాకున్॥

* చంద్ర=చంద్రుఁడు—కర్పూరము బంగారము—నల్లతుమికిచెట్టు—శ్రేష్ఠుఁడు.
(సంస్కృతశబ్దార్థకల్పతరు)

* క॥ ఓ మాళవి యో మాగధి । యో మాధవి యో స్రవంతి యో వాసంతీ।
నా మానసహరుఁ డీవన । భూమిఁ బడి వచ్చెఁ జూపఁ బూనరె కరుణన్॥

† సీ॥ సురస నీ వెఱుఁగవా సురసధీరవిచారు సురభి నీ వెఱుఁగవా సురభిళాంగు।
సుముఖ కానవు కదా సుముఖ సందర్శను సౌమ్య కానవు కదా సౌమ్య హృదయు।
మధుర యెఱుంగవా మధురవాగ్వైభవు ప్రియ యెఱుంగవ రతిప్రియవిలాసు।
శారద కానవా శారదాధిపతేజు పద్మ కానవ కనత్పద్మనయను।
గీ॥ ఇంద్రవల్లి రో చూడవా యింద్రవిభవు । చంద్రరేఖ యెఱుంగవా చంద్రహాసు।
నను వరింప కవిడ నాడి వనమునందు । వెనఁ బలాయితుఁ డయ్యె నే వెతలఁ గుంద॥

వ. అకట అకటకట ఏమి యీ వింత. ఎవ్వరును మాఱు బలుక రే. ‡ వనితారత్నంబులకు శ్యామామణులయెడ ననుగ్రహము పుట్టనిచో నితరుల నేల దూషింపవలయును. పాపికి సముద్రము మోఁకాలిబంటి యనుట సత్యమని తోఁచెడి. మంజులకుంజపుంజరంజితంబగు నీ కాననాంతరంబున దూరస్థంబులగు పదార్థంబులు గోచరించుట దుర్లభంబుగనుండును. వృక్షారోహణం బొనరించి కెలఁకు లారసి చూచుట కార్యంబుగాఁ దోఁచుచున్నయది.

(అని వృక్షారోహణం బొనర్ప యత్నించుచు సాధ్యంబు గాక.)

---

* మాళవి=పాటచెట్టు. (అభిధాన) మాగధి=అడవిమొల్ల. (అభిధాన) మాధవి = పువ్వులగురివెంద. (అభిధాన) స్రవంతి=రుదంతియనువృక్షము (అభిధాన) వాసంతి = వసంతమల్లిక. (అభిధాన)

స్త్రీలింగ సారస్యముచే నీశబ్దముల శాయాదేశముల యందలి స్త్రీసామాన్యవాచకములుగా గ్రహింపవచ్చును.

† సురస=కృష్ణతులసి, సురభి = నల్లికీవృక్షము, సుముఖ = నల్లగగ్గర, సౌమ్య=ముయ్యాకుపొన్న, మధుర=కమ్మరేగు—రాచమామిడి, ప్రియ=ప్రేంకణము, శారద = ఏడాకులరఁటి, పద్మ=నేలతామర, ఇంద్రవల్లి = ఇల్లింద, చంద్రరేఖ = క్రాలుఁగచ్చ (అభిధాన రత్నమాల.)

(స్త్రీలింగ సారస్యముచే నీశబ్దములను స్త్రీనామవాచకములుగా గ్రహింపవగును.)

‡ వనితా = విష్ణుక్రాంతము—(ప్రాయుక్తస్త్రీ), శ్యామా = శమీవృక్షము — (ప్రాయుక్తస్త్రీ). (సంస్కృతశబ్దార్థకల్పతరు.)

* గీ॥ మాలతీరమ్యవాసరమావిలాసు । మాలతీరమ్యరూపరమావిశాసు।
మాలతీనీవులోలతమాలశాఖఁ । గాలఁగంటివిచూడుమాకానవరపి॥

† గీ॥ కాముకోపరతిక్రీడఁగాలుకరణి । కాంతవిటపోపరిస్థితిఁగాంచుభాగ్య।
కాలిప్రాకామినీమణిసరగనీవు । మత్ప్రియునిఁజూపి వెతమాపిమనుపవమ్మ॥

‡ గీ॥ రమ్యచంచలాభిరామజీమూతసం । చయములారతరణిచంద్రమండ।
లంబులారరూపలావణ్యనిధిఁబ్రియ । ప్రవరుఁజూపివనటఁబాపవలదే॥
(అని గగనోన్ముఖియై చూచుచు ఏమియుఁగానక యూరకుండి.)

ఉ॥ ఇచ్చటలేఁడువాఁడుమఱియెచ్చటనుఁగనరాఁడువాఁడుతా।
నిచ్చబడిఁగిరిఁవనులనిచ్చటనచ్చటమార్గమారయన్।
జొచ్చిన నెవ్వరాతెరువుఁజూపెడునంతటివారలేమనన్।
వచ్చుక్షుధార్తిమైబడలివాఁడిట నేమగునోక్కొదైవమా॥
(అని నిజమణిమందిరంబుఁజూచి వేసరి.)

వ. ఆహా దైవమా ఏమి నాతలవ్రాఁత.

ఉ॥ ఇంతయువజ్జ యున్నదిసహింపకతెంపునమర్త్యకాంతల।
త్యంతమురజ్జవారిగరళాదికసాధనబాధలొర్చిప్రా।
ణాంతముఁగాంతురెంతయుమహత్త్వముగల్గునమర్త్యకాంతనై।
యెంతమహావమానముసహించితినక్కటయేమిసేయుదున్॥

ఉ॥ మందులమంత్రతంత్రములమానకపూనినప్రార్థనాదికా।
మందమహాప్రయత్నములమానినులన్బురుషుల్వలంచుటల్।
గందుమువిందుమెందునటుగాకిటుతద్విపరీతమూనుటెం।
దెందునుగానమిట్లతనినేబలిమాలితిసిగ్గుమాలితిన్॥

ఉ॥ ఏమనుదాననాదువిధినేమనిప్రాణముమేననూనియుం।
కేమనుదాననామదికినింపగునాసుకుమారుమారుసు।

* మాలతి = వెన్నెల—యౌవనస్త్రీ—జాజితీఁగె (నానార్థ.)

† కాంత = మనోహరుఁడగు — తియ్యమామిడిచెట్టు, విటప = విటశ్రేష్ఠుఁడు తరుశాఖ, కామిని = స్త్రీ—బదనిక—(అభిధాన.)

‡ సుమహిత=శ్రేష్ఠములగు—పుష్పములచే హితములగు, చంచలా=ములు మెంపలి, జీమూత = మేఘము—దేవతాళవృక్షము—(శబ్దార్థ) తరణి = సూర్యుఁడు పిన్నగోరంట—(శబ్దార్థ) చంద్ర = చంద్రుఁడు—నల్లతుమికిచెట్టు—(శబ్దార్థ.)

త్రామకుమారుఁబోలినయాదారుఁదగన్ గవఁగూడినంతలో।
ద్దామసుఖానుభూతి ప్రమదంబునఁ గాంచకయున్న నియ్యెడన్॥

వ॥ అకటకట హృదయానందకరసుందరసుకుమార స్వరూపులగు దేవగంధర్వ యక్ష కుమారకులనేకులు మదీయానన్యసామాన్యరూపలావణ్యాదులకుం జిక్కి క్రుక్కి క్రుక్కిళ్లు మ్రింగుచు మత్కృపాకటాక్షవీక్షణంబు లపేక్షించి పొంచి పరితపించి సంచుగానక తిరుగుచుండ వారి నెవ్వరిన్ లక్షింపక యక్షిణను ఖాధ్యత్మనై నేనున్నయెడకావిప్రకుమారుండాకస్మికంబుగ నేలవచ్చె; వచ్చిన నేమి అతిథి సత్కారంబులు సలిపి తదీయ నగరమార్గమే నెఱుంగనని తెలియం బలికి యూరకపోవనంపక నే నేల వాని నభిలషించితి. మనుష్యసామాన్యుండగు వాఁడాతీరున నప్సరోంగనయగు నన్నుపేక్షించి నాప్రార్థనాదికంబులన్ బోఁద్రోచి అవార్యధైర్య స్థైర్యవీర్యప్రాభవంబులు వెల్లడిఁ గొలుపుచు నేలనిర్గమించిచనిరయె; చనిన నేమి యంతట మఱచి యూరకుండక తద్విరహవేదనానల కీలాకలాపతాపదోధూయమానమానసనై వానినన్వేషించుచు పరితపించి డస్సి క్రుస్సితి. ఇది దైవకృతంబు గాని సామాన్యంబుగాదు. ఇప్పుడైనను నీచింతవదలి యెప్పటియట్ల సుఖంబుననుండుదునన్న నామహామహుని దివ్యతేజఃపుంజరంజితంబగుమంజులరూపంబు కనులఁగట్టినట్లు హృదయఫలక కీలితంబగునట్లు మానసాలాన నిగళితంబగునట్లు పరిపరివిధంబులందోఁచుచు నన్నుం బరితపింపఁ జేయుచున్నయది. ఇఁక నెట్టులోర్తు, నెట్లు ప్రాణంబులుధరింతు, రంభాదిప్రాణసఖులముఖావలోకనంబెట్టులొనర్తు నయ్యో! దైవమా ఏమిసేయుదాన. నెందుఁజొచ్చుదాన. నీవియోగభరంబెట్లు భరియింపన్ గలదాన. ఆహా దైవోపహతంబగు నావలపున న్నింతకుఁదెచ్చె. నిర్భాగ్యరాలికి నింతగాకింకేమియగు. మిక్కుటంబగు నాయాసభరంబున స్వేదబిందుబృందంబుల మందగతిన్ జ్రాలె. ప్రాణంబులుపోలె. నంగంబులుప్రీలె. నయ్యో అకటకటా ఆహా.

(అని మూర్ఛిల్లుచున్నది.)

ద్వితీయాంకమున—ప్రథమరంగము.

స మా ప్త ము.

---

## ద్వితీయాంకము—ద్వితీయరంగము.

### వరూధినిమణిమందిరము.

[రంభ, మేనక, తిలోత్తమ, ఊర్వసి మొదలగు నప్సరస్త్రీలు ప్రవేశించుచున్నారు.]

రంభ—మేనకా ఏమె వరూధినింగానము.

మేనసి—గృహాభ్యంతరంబున నున్నది కాఁబోలు.

ఊర్వసి—పోయిచూతము.

తిలోత్తమ—చూచితిమి ఎక్కడనుఁ గానరాదే. ఏమి యీచిత్రము.

రంభ—శ్రీపార్వతీపరమేశ్వరసందర్శనార్థము కైలాసంబునకేగెనో.

మేనక—ఈయపరాహ్ణకాలమునందా యీశ్వరసందర్శనము.

ఊర్వసి—మనమందరముఁ గలసి సాయంకాలమున నీశ్వరదర్శనార్థము పోదమని వరూధిని చెప్పఁగా గదా మనమిపుడిటకుఁ వచ్చితిమి.

తిలోత్తమ—అవును వరూధిని తానొంటిగ నటఁబోవను కాలము కాదు. కారణమును లేదు.

రంభ—గృహారామసీమ నున్నది కాఁబోలు. పోయిచూతము.

(అని యందరును గృహాంగణంబునకు వచ్చుచున్నారు.)

మేనక—ఆహా! ఇదియేమి చిత్రము. మనవరూధిని యిట మూర్ఛపడియున్నది.

ఊర్వసి—ఏమె ఏమంటివె. ఎక్కడ.

తిలోత్తమ—చెలియా ఎక్కడనో.

రంభ—ఆహా అకటకట అయ్యో.

మేనక—మన ఆహాలు అకటకటలు అటుండని. మొదట మనచెలియఁ గూర్చుండఁబెట్టుకొని శైత్యోపచారంబులు సేయ యత్నింతము.

ఊర్వసి—నేను వరూధినిఁ గూర్చుండఁబెట్టుకొనియెద.

రంభ—నేనుఘర్మాంబువులు తుడిచెద.

మేనక—నేను వీడినకురులు చెదరినముంగురులు సవరించెద.

తిలోత్తమ—నేను వీవన వీచెద.

ఊర్వసి—నేను శీతలాంబువులు చల్లెద.

రంభ—ఆహా! మనచెలి కనులు విచ్చుచున్నది.

మేనక—ఔనౌను కొంచము నిదానింపుడు.

(ఇంతలో వరూధిని చక్కఁగా మూర్ఛతేఱి కూర్చుండుచున్నది.)

రంభ—

ఉ॥ ఏమెవరూథినీయిటుమహీస్థలినీహిమశైలశృంగమం।
దీమణిమందిరాంగణసమిద్ధవిశాలరసాలసాలమూ।
లామలచంద్రకాంతరచితాంచితవేదికనిట్లుమోహని।
ద్రామయమూర్తి వౌటకుఁగతంబదియొయ్యదియోవచింపవే॥

మేనక—

మ॥ చెలియాయెందులకీవిచారముకడున్ జిత్రంబుచింతింపఁజే।
తులకున్ జిక్కినవానిఁబోవిడిచిచేతోవీధినీరీతిఁగొం।
దలమందన్ దగునంచుఁదోఁచె
(తిలోత్తమదిక్కుచూచుచు.)
నటుకాదాయయానచేయట్లుగాఁ।

తిలోత్తమ—

దలపోయన్ దగియున్నదీచెలువచందంబంతయున్ మానినీ॥

ఊర్వశి—

పంచచామరము॥ వరూథినీయిదేమెనీవవార్యశోకవార్థిలోఁ।
గరంబుమున్గియుంటఁజూడఁగాబిరానఁగౌఁగిటన్।
విరాళిమీఱనున్న జారవీరుఁగానకెంతయున్।
బరాకుమానివ్రాలియున్నభంగిదోఁచెడున్ గడున్॥

మేనక—సఖి! ఎందుకే యీ మానము.

వరూ—అయ్యో! చెలియలారా యేమనిచెప్పుదును.

(అని కన్నీరునించుచు ఏడ్చుచున్నది.)

రంభ—ఓసఖి! ఓవరూథినీ ఎందుకే యీబుసబుసలు.

మేనక—చెలీ! ఈగుటగుటలెందుకు. నీశోకమునకున్ గారణంబెయ్యదియో విను
పింపుము.

వరూథిని—

సీ॥ రాకాసుధాకరాలోకలోకాంచితాస్యమువాఁడుకమలనేత్రములవాఁడు।
కుందాభినవవిభామందసుందరదంతములవాఁడుకనదురస్థలమువాఁడు।
శుండాలశుభకరదండమండితబాహువులవాఁడుంచిటిగొనుచెలువువాఁడు।
అక్షీణయూథపాలాక్షతేజఃపుంజరుచివాఁడువిద్యానిరూఢివాఁడు।

గీ॥ దివ్యరతిరాజసమరూపదీప్తివాఁడు । కాంచనాంచితతనురుచిఁగాంచువాఁడు।
ప్రవరుఁడనునొకబ్రాహ్మణప్రవరుఁడొకఁడు।చక్కనిటఁజేరియునుజారిచనియె నేఁడు॥

మేనక—వాఁడా నీనీటు కాఁడు.

తిలోత్తమ—ఓచెలి వాఁడెక్కడివాఁడు. వాఁడిటరాఁ గారణంబెద్ది.

వరూధిని—

సీ॥ ధారుణి వరుణాస్పదంబను పురమున నివసించు బ్రాహ్మణప్రవరుఁడతఁడు।
ఈహిమాచలమున నెసఁగుతీర్థంబులనచ్చుగ సేవింపవచ్చెనతఁడు।
మధ్యాహ్నమునఁబురమార్గమారయుచు నాకస్థికంబుగనను గాంచెనతఁడు।
నానావిధంబులఁబూని ప్రార్థించినలోఁగక నను ద్రోచియేగెనతఁడు।
గీ॥ దుర్గమారణ్యభూములు నిర్గమింపఁ । జాలఁడెను నా సఖగమ్య గసాలములను।
వల్లికాదులనడుగుచు వనమునందు । వరసి చూచినఁగానరాఁడయ్యెనతఁడు॥
క॥ ఓతరుణులారమధ్యా । హ్నాతపమున కోర్చి కర్కశారణ్యములన్।
వేతిరిగితిరిగి గాసిలి । యీతెఱఁగునమూర్ఛమూఁగియిట నేఁబడితిన్॥

రంభ—ఆహా! ఏమె చెలి ఆపై దికునకుఁగా వా ఈ యార్భటము.

మేనక—ఆబమగు బాఁపనయ్యను నీవేమని వలఁచితి వే.

వరూధి—మేనకా నీవట్లనఁబోకుము. నీవు మున్ను వలంచి మించిన వికటజటాజూటకర్కశుండును, భస్మోద్ధూళిత విగ్రహుండును, కాపీనధారియు, వికారస్వరూపియునగు నా కౌశికున కీవిప్రకుమారునిఁబోల్చెదనని తలంచితివి కాఁబోలు. అటు స్వప్నముననైన నన్ దలంపకుము.

మేనక—ఆహా! నీవువరించిన విప్రకుమారుండంతటి యనన్యసామాన్యరూపలావణ్యాదులు కలవాఁడఁటె.

వరూధిని—ఔను నిస్సంశయము.

మ॥ తలిరుంబ్రాయము వాఁడు వాఁడు మఱి నిద్రాజాళు వామేనిచా।
యలనిగ్గుల్ గలవాఁడు వాఁడు మఱియున్ వ్యామోహముల్ గొల్పని।
ర్మలహాసద్యుతి వాఁడు వాఁడు మఱియున్ నాటాడనీటామవ।
ల్కలతీవుల్ గలవాఁడు వాఁడుగనఁబోలున్ నీకు వానిన్ జెలీ॥

సీ॥ వానిచక్కని మోము పూనిరాకాచంద్రమండలద్యుతులనటుండుమనుమ।
వానితియ్యనిమోవిమానితామృతరసాఖండమాధురినినటుండుమనుమ।

వానినిద్దంపుపల్వరుససుందరకుందకాండపఙ్క్తులనునటుండుమనును।
వానిమవ్వపునవ్వువరహీరఘనసారఖండకాంతులనునటుండుమనును।
గీ॥ వానివక్షఃప్రదేశంబువానిమధ్య । సీమగిరిసానువులమఱిసింహములను।
నొప్పిదముపేర్మిఁదగనటుండుండుమనును । వానివర్ణింపఁదరమెయీచానవాకు॥
క॥ దురదృష్టవతికినాకా । పరమాద్భుతరూపరేఖభాసిలుపురుషుం।
డరమఱలులేకదొరకొను । సిరియబ్బునెయింకనేమిసేయుదునకటా॥

(అని వెచ్చనూర్చుచు నేడ్చుచున్నది.)

రంభ—

ఉ॥ మానముదూలనిట్లుపలుమాఱునువందురనేలచాలుదు।
ర్మానముఁబూనినీవలపుమన్ననసేయకత్రోఁచిచన్నయు।
మ్మానవుఁడెంచుఁబోవనుమానములేదిదనీమహాగ్రహో।
ద్ధ్యానమునందుఁజిక్కఁగలఁడారయఁబోడనురమ్మునెచ్చెలీ॥

మేనక—అది సత్యమనితోఁచెడి.

ఊర్వసి—

క॥ నినుడించిపోవనూపక । వనితరొవాఁడీగ్రహోపవనవాటమునన్ ।
మినుకుచుఁగునుకుచునుండును । చనినెమకుదమండఱమునుజయ్యననటకున్॥

తిలోత్తమ—ఇప్పుడదియ కర్తవ్యమని తోఁచుచున్నది.

(అని అందఱును నిర్గమించుచున్నారు.)

ద్వితీయరంగము సమాప్తము.

## ద్వితీయాంకము—తృతీయరంగము.

వరూథినీమణిమందిరారామవాటిక.

[మణిమంతుఁడను గంధర్వకుమారుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

మణిమంతుఁడు—ఆహా! ఏమి నా భాగ్యము.

సీ॥ బహుదినంబులనుండిపాయకియ్యెడనిల్చికొలఁకులారయుచుగ్రుక్కిళ్లుమింగి।
ఎటనున్నఁజాటునునటుపొంచితిలకించితెలియకవెనువెంటఁదిరిగితిరిగి।
గాలిఁదూలుచుఁగొంగుకడచన్నవెలిబద్దగుబ్బలఁగనిమదనుబ్బియుబ్బి।
కనులఁగట్టినయట్లుగనుపింపనలరుచుభ్రమఁగొనికానకనెమకినెమకి।

గీ॥ కంటఁబడిధిక్కరించినగెంటిగెంటి । పూనిపైకొననేరకపొగిలిపొగిలి।
వేళగూడమిసమయంబువేచివేచి । యుంటినో దైవమాయనియోహటించి॥

వ. దైవఘటన యట్లుకదా తటస్థింపవలయును. (కష్టీఫలి) అని యుండలేదా! బహు దినములనుండి నానావిధప్రయాసములకోర్చి కాచియున్న నా కోరికకు ఇది కదా సాఫల్యకాలము. చెడుకార్యములకుఁ జొరఁబూనుటకుముందు కొంత యుక్తాయుక్తవిచారముచేయుట మంచిదని పెద్దలు చెప్పుదురు. ఆ రీతి నాలోచించినచో.

చ॥ అమృతహలాహలాంబుధిమహోద్భుతసాహసపావకప్రభం।
జనమతివంచనోరగవశగ్రహవరంబఘకంటకాకరా।
వనమురుపత్యదావదహనంబు చిరంతనసూనృతావనీ।
జనవకుఠారధారయనజారవిహారము మీఱునెప్పుడున్॥

వ. ఐననో నేను తనుఁ బలచి గుక్కిళ్లుమ్రింగుచుండుట విశదంబుగ నెఱింగియు ఆ వరూథిని నన్ను తాను గా వలచి ఏల కలియఁగూడదు. అది అట్లుచేయని నాడు నేనేల దానిఁ గూడి యత్నింపఁగూడదు. దానికి నాయందిష్టము లేకున్న దే యందు రేమో నాకు దానియందిష్టమున్నదికదా. అంతచాలదా. ఇట్టిది వ్యభిచారమగునా కాదు. ఎట్లగును. ఇంతికు.

మ॥ ప్రమదాకాముకుఁడెందునుఁ సుజనతాపక్లేశమాత్రానుతా।
పము బాంధవ్యవిభేదమార్యజనకోపక్లాంతిలోకాపవా।
దము మర్యాదనుశీలమార్జవము సత్యంబిష్టకార్యక్రమా।
క్రమసందర్భములెంచ నేహృదయకాంక్షాపూర్తివాంఛించుచోన్॥

సీ॥ బహుళమాయోపాయమహిమావిశేషముల్ వెలయించి ప్రవరునివేషమూని।
కపటనాటకములుత్కటముగాఁ బ్రకటించి వనభూమినీవలావలఁ జరించి।
కాంతకు నాకస్మికంబుగాఁ గనుపించి యొల్లమి గాన్పింపనల్లనొదిగి।
పలుమాఱుఁ బిగియుచుఁ బ్రాణనావళముననరమఱలోఁగినట్లభినయించి।

గీ॥ శాపమునకాస్పదంబీకచనువు నెఱపి । మంచిరతి వేళకనులుమూయించిమించి।
వంచనరమించితగనొకసంచుఁగాంచి । జక్కఁజనువాఁడనదిమదిపొక్కిపొగల॥

వ. ఈ వరూథిని నన్ను ఇంతకాలము ఇంతగా వేధించినందుకు ప్రతీకారమగునట్లు నే వారీతి సేయుచున్న నేను గంధర్వకుమారుఁడనగుదునా. నా పేరు మణిమంతుఁడను టకుఁ దగునా. మంచిది చూతము. (అని నిష్క్రమించుచున్నాఁడు.)

తృతీయరంగము సమాప్తము.

## ద్వితీయాంకము—చతుర్థరంగము.

### వరూధిని యుద్యానవనము.

రంభ—వరూధినీ ఇదే నీయుద్యానము. నేడు నీవుపడిన ఆయాసాతిశయంబున నీముఖము మిగుల వాడియున్నది. ఈజలయంత్రనముజ్ఝితంబులగు శీతలాంబువులన్ గడిగికొని కురులు ముంగురులు సవరించుకొని యీమంజులవల్లకరజఃపుంజముననొక బొట్టుం బెట్టుకొనుము.

వరూధిని—అవును అటుచేసెద (చేయుచున్నది) చెలియ నాకు వామనయన వామభుజంబులదరుచున్నవి. ఎందుకు నేఁటి ఆయాసవిశేషంబునవా.

రంభ—వరూధిని నీవు ప్రౌఢవని నేను తలంచియుంటిని. శుద్ధముగ్ధాస్వరూపముగ నున్నావె.

మేనక—అటుకానిదే. ఇది ఆబ్రాహ్మణమాత్రునకై ఇంతవందురునా.

రంభ—అది అటుండని. వరూధిని నీకాయంగంబులదరుట శుభసూచకము. నీకోర్కె సఫలంబగు. సందేహములేదు.

ఊర్వశి—సఖి! వరూధిని రంభపలుకు సత్యము. నీశుభసూచనంబులకనుగుణంబుగ.

* సీ॥ అతులలక్ష్మీమాధవాధిక్యసహితంబుశారదాబ్రహ్మాభిసంయుతంబు।
సంభ్రమోజ్జ్వలగిరిజాశివోపేతంబుమహితశచీశక్రమానితంబు।
వరుణాగ్నికాలకర్బురముఖ్యనికరంబుమాన్యసువర్ణమన్మథయుతంబు।
వితతాతిముక్తసంతతసంప్రయుక్తంబుబహునటీగణికాభిభాసురంబు।
గీ॥ చండకాంతమహామునిసంకులంబు । సమధికానందవైభవసంశ్రితంబు।
గాఁగనీవనరాజంబుకాంతకంబె । సుమహితాకుంతవెకుంతసమగినలరె॥

* లక్ష్మీ = మహాలక్ష్మి—శమీవృక్షము, మాధవ = మహావిష్ణువు—ఇప్పచెట్టు, శారద = ఏడాకులరఁటి—సరస్వతి, బ్రహ్మ = నలువ—బ్రహ్మిచెట్టు, గిరిజా = పార్వతి—మాదీఫలపుచెట్టు, శివ = మహేశ్వరుఁడు—గుగ్గిలపుచెట్టు, శచీ = ఇంద్రాణి—శతావరి, శక్ర = ఇంద్రుఁడు—ఎఱ్ఱమద్ది, వరుణ=వరుణుఁడు—విరజాజి, అగ్ని=అగ్నిదేవుఁడు—నల్లజీడి, కాల= యముఁడు—తాటిచెట్టు, కర్బుర=నైరృతి—కలుగొట్టుచెట్టు, సువర్ణ = మంచియాకులుఁగల గరుడుఁడు, మన్మథ = వెలగచెట్టు—కాముఁడు, అతిముక్త=మిగుల ముక్తినొందినవారు—సెమ్మిచెట్టు, నటీ = నాట్యమాడుస్త్రీ—కాకితొండ, గణికా = భోగముది—అడవిమొల్ల, చండ = తీవ్రకోపముగల—కస్తెచెట్టు, కాంత = కాంతినొందిన—పువ్వులగురివెంద, మహాముని = గొప్పమునులు—రుద్రాక్షచెట్టు. (శబ్దా.)

తిలోత్తమ—ఊర్వసీ! నీ వెంతబుద్ధిశాలివె. వనమును వైకుంఠమునకుఁ బోల్చితివి. ఇది బహుచమత్కారయుక్తముగనున్నది. ఇట్టి వైకుంఠసందర్శనంబున మన వరూధినికి మేలుఁ గలుగకమానదు.

ఓవరూధినీ చూచితివా!

* సీ॥ నానాసువర్ణవితానాభికలితంబుపర్యంకపాళికాబంధురంబు।
కమనీయతరదీపకళికావికాసంబుమంజులక్రముకాభిమండితంబు।
బహువిధపరిపక్వఫలభరభరితంబుసురభిళత్సుమనోభిశోభితంబు।
ఘనఘుమఘుమితసుగంధసంభారంబుస్వాదుమాధురసాతివాసితంబు।
గీ॥ మహితకాంచనపటకుసుమప్రకాండ । సంప్రభూషితవిటపైకసంభ్రమంబు।
నగుచువనకుంజమదెభవదాగమంబుఁ । గోరుకేళీగృహంబనఁగొఱలెఁగంటె॥

రంభ—ఓ సఖి! నీవు వర్ణించినది మిగులసారస్యముగనున్నది. విటపశబ్దమునకు కేళీగృహపర్యాయమున వాచ్యము కాఁదగిన పదార్థ మొకటిమాత్రము లోపముగనున్నది. అది యును శీఘ్రంబునఁ బూర్ణంబు కాఁగలదు.

మేనక—ప్రకృతంబున వరూధినికా సౌఖ్యంబు లేకున్నను వనంబున అనేకులకు కలిగి యున్నది. (అని వరూధిని దిక్కు చూచి.)

వరూధిని—

† గీ॥ సకియపున్నాగశుభకరశాఖలందు । మెలసిమహిళావతంసంబు వెలసెఁగంటె।
సకియపున్నాగశుభకరశాఖలందు । మెలసిమహిళావతంసంబు వెలయుటరుదె॥

* సువర్ణవితాన = నానావిధములగు పత్రపుష్పముల మంచివన్నెల సముదాయము—దేవదారువృక్షము బంగారుజరీబట్టల మేలుకట్లు, పర్యంకపాళిక = మంచములవరుస—కట్లతీఁగ, క్రముక = తాంబూలపుబరిణ—పోఁకచెట్లు, కాంచన = బంగారు—దేవకాంచన వృక్షము, పట = వస్త్రము—మొగలిచెట్టు, విటప = విటశ్రేష్ఠుఁడు—తరుశాఖ, కుంజ = పొదరిల్లు. (శబ్దా.)

† పున్నాగ = పొన్నచెట్టు, శుభకర = శోభనకరములగు, శాఖలు = కొమ్మలు, మహిళా = ప్రేంకణపుచెట్టు, పున్నాగ = పురుషశ్రేష్ఠుఁడు, శుభ = శోభనకరములగు, కరశాఖలు=బాహువులు, మహిళా = జవ్వని, వతంసము = శ్రేష్ఠము (శబ్దా.)

మేనక—

* క॥ కోమల కాంతాక్రాంత । శ్యామామంజులకుచద్వయంబున నధిక।
స్తోమముగ గోరువంకలు । కామినిగనుపట్టెఁ గంటెఁ గడు చిత్రగతిన్॥

వరూధిని—

† క॥ కోమలకాంతాక్రాంత । శ్యామామంజులకుచద్వయంబున నధిక।
స్తోమముగ గోరువంకలు । కామినిగను పట్టుటదియుఁ గడుఁ జిత్రంబే॥

మేనక—

‡ ఉ॥ మానినికంటె పుష్పవతి మాధవి లోలతఁ జిత్రపత్రసం।
తానయు లోలభృంగసముదాయము మాధురసాతి సౌరభా।
నూనయు నైరసంబునను నూహరలీలఁ బ్రియానుషంగమున్।
బూనికఁ గాంచి మించె

వరూధిని— వనబోఁటులకన్యది చెల్లునే చెలీ॥

మేనక—

§ క॥ మాళవికాంభోజియు నే । పాళియు ద్రావిడియు మతియు బర్బరియును బ।
త్త్రాళీసుమనఃపల్లవ । పాళీయుతి నింపుఁ గనుట భామినికంటే॥

వరూధిని—

క॥ మాళవికాంభోజియు నే । పాళియు ద్రావిడియు మతియు బర్బరియును బ।
త్త్రాళీసుమనఃపల్లవ । పాళీయుతి నింపుఁ గనుట భామినియును దే॥

---

* కాంత = తియ్యమామిడిచెట్టు, శ్యామా = జమ్మిచెట్టు, మంజు = రమ్యమగు, లకుచ = నిమ్మచెట్టు, గోరువంకలు = శారికలు.

† కాంత = విటుఁడు, శ్యామా = యవ్వనస్త్రీ, మంజుల = రమ్యమగు, కుచద్వయము = కుచయుగము, గోరువంకలు = నఖక్షతములు.

‡ పుష్పవతి=పుష్పించినది—ముట్టుపడినది, మాధవి = వసంతమల్లిక—మాధవియను స్త్రీ, పత్ర = ఆకులు—మకరికాపత్రములు, భృంగ = భ్రమరములు—ముంగురులు, మాధురస = తేనె—మద్యము, ప్రియ = ప్రియుఁడు—ప్రేంకణము.

§ మాళవి = చిరుబొద్ది, కాంభోజి = గురిగింజచెట్టు, నేపాళి = విరజాజి, ద్రావిడి = తీఁగెతుమికి, బర్బరి = కుక్కవాయింట, పత్త్రాళీ = ఆకుల సమూహము—మకరికాదిపత్రములు, సుమనః = పుష్పములు—మంచిమనస్సు, పల్లవ = చిగురుటాకులు—విటపురుషులు, రంభ = రంభయనువచ్చర—అరఁటిచెట్టు, మహాబల = అధికసామర్థ్యము—వాయువు, మహా = గొప్ప, బల = కరివేఁపచెట్టు, రావణ=దశకంఠుఁడు, చిట్టితుమికిచెట్టు — బలరాక్షసిచెట్టు.

మేనక—

ఉ॥ ఇంతిరొ! కోమలత్వమున నెంతయు శోభిలు రంభ భూరిదు।
ర్దాంతమహాబలోచ్ఛలితరావణబాధనలంగెఁ గంటె

వరూధిని— యా।

నెంతయుఁ గోమలత్వమున నింపుగ శోభిలు రంభ యున్నదు।
ర్దాంతమహాబలోచ్ఛలితరావణబాధనలంగ దే చెలీ॥

రంభ—ఎందులకే నా ప్రశంస.

వరూ—ఇవి యన్నియు మేనక చేయు కుచేష్టలు. దానికి నాయందు ఏమో అసూయత కలిగినట్లున్నయది. నేను తనకౌశికుని దూషించితినని కాఁబోలు. నా కంతకంతకు విరహవేదనానల మధికముగ నొనర్చు మార్గమవలంబించియున్నది.

ఊర్వసి—మేనకా! అట్లు సేయకుము.

మేనక—నే నేమంటిని. వృక్షలతాదులను విటవిటీజనులకుఁ బోల్చి వర్ణించితిని.

ఊర్వసి—మేనకా నీ వూరకుండుము. వరూధినికిఁ దాపోపశమమగురీతి నే వచించెద.

(అని వరూధిని దిక్కుఁ జూచుచు.)

* క॥ సారసముఖి కంటె రమా । నారాయణ శోభికనదనంతాతిమహా।
స్ఫారరుచిఁ బొల్చు వనమల । క్షీరాంబుధిఁ బోలె మిగులఁ జెన్ను వహించెన్॥

† క॥ లాలితగోపీడోలాం । చోలితశ్రీకృష్ణసారదుర్ధర్షాత్యు।
త్తాలబలసంహతస్థితి । వ్రాలిన పూతననుగంటె వనజాతముఖీ॥

---

* రమా = లక్ష్మీదేవి—సురుగుడు చెట్టు—(అభి) నారాయణ = విష్ణువు—జామచెట్టు (పర్యా) అనంత = ఆదిశేషుఁడు—తిరిగొట్టు చెట్టు, మహా = గొప్ప—కోవిదారవృక్షము—(శబ్దా) రుచి = ప్రకాశము—దవనము—(అభి.)

† గోపి = గోపికాస్త్రీ—బదరీవృక్షము, డోలా = తొట్ల—నీలిచెట్టు, శ్రీ = సంపద్యుక్తుఁడగు—కోవిదారము, కృష్ణ = బాలకృష్ణుఁడు—కలివిచెట్టు, దుర్ధర్ష = తిరస్కరింపరాని—నల్లయుప్పి, బల = సామర్థ్యము—ముత్తవపులగచెట్టు, పూతన = పూతనారాక్షసి—కరక చెట్టు—(అభి.)

తిలోత్తమ—

* గీ॥ తోయజాక్షిరోవినాయకసహితకు । మారయుతముమాభిమండితంబు।
ప్రీతినెఱపుచంద్రరేఖాభిరామోగ్ర । వైభవంబుఁగాంచెవనముకంటె॥

మఱియును.

† క॥ ఐరావతయుతమింద్రా । ణీరమ్యముశక్రమాననీయముసుధా।
ధారమునగువనరాజము । సారసముఖికంటెస్వర్గసామ్యతనలరెన్॥

‡ గీ॥ మత్స్యకమఠవరాహసమన్వితంబు । కేసరీ కుబ్జవరరామ కృష్ణకల్కి।
మండితంబునగువనమండలంబు । తారసిలెవిష్ణులీలావతారమహిమ॥

§ గీ॥ ఘనతకన్యాతులాభియోగంబుఁగాంచి । కేసరీవృశ్చికంబులవాసిఁగాంచి।
కర్కటకఝషవృషములకలిమిఁగాంచి । వనముదగెరాశిమండలమనరహించి॥

రంభ—చెలియా వరూధినీ! ఈవనమహిమచూడంజాడ.

¶ సీ॥ అతులభీష్మద్రోణయుతరాజరాజంబుశకునికన్యాజాతసంశ్రితంబు।
ఆకృష్టకబరీపటాకుంతకృష్ణంబువారితపాండుకుమారకంబు।

---

* వినాయక=విఘ్నేశ్వరుఁడు—గరుడపక్షి, కుమార=షణ్ముఖుఁడు—వరుణవృక్షము, ఉమా = పార్వతి—ఎఱ్ఱయగిసె, చంద్రరేఖ = బాలచంద్రుఁడు—కానుగచ్చ, ఉగ్ర = ఈశ్వరుఁడు—బెత్తము (అభి)

† ఐరావత=తెల్లయేనుఁగు—ఎఱ్ఱకిత్తిలి (శబ్దా) ఇంద్రాణి=శచి—తెల్లవావిలి (అభి) శక్ర=ఇంద్రుఁడు—ఎఱ్ఱమద్ది (శబ్దా) సుధా=అమృతము—జెముఁడు (అభి).

‡ మత్స్య = బచ్చలికూర (అభి) కమఠ=వెదురుమొలక (శబ్ద) వరాహ=తుంగముస్త (శబ్ద) కేసరీ=నాగకేసరము (అభి) కుబ్జవర=పొట్టినల్లదిండెనచెట్టు (శబ్ద) వామనుఁడు రామ=నురుగుడుచెట్టు (శబ్ద) కృష్ణ=నల్లతులసి, కల్కి=తాండ్రచెట్టు.

§ కన్యా=కొమ్ముపొట్ల (అభి) తులా=తులారాశి, అతుల=సమానములేని, కేసరీ=పొన్నచెట్టు (అభి) వృశ్చిక=తేలుమణిచెట్టు (అభి) వృషా=అడ్డసరము (అభి) కర్కట=నల్లచెరకు (అభి) ఝష=బీరచెట్టు.

¶ భీష్మ = శాంతనవుఁడు—భయంకరము, ద్రోణ = ద్రోణాచార్యులు—తుమ్మిచెట్టు (శబ్దా) రాజరాజ=దుర్యోధనుఁడు—అరటిఁగ (అభి) శకుని=సౌబలుఁడు—పక్షులు, కన్యాజాత = కర్ణుఁడు, కన్యా=కలబంద + జాత=గుంపు (అభి) కబరీ=కేశపాశ—తేలుమణిచెట్టు (అభి) పట=వస్త్రము—మొరలిచెట్టు (అభి) కృష్ణ=ద్రౌపది—కలివిచెట్టు (శబ్దా) పాండు =

సంహతధూర్తకీచకకులోపేతంబువ్యాప్తానుభావబృహన్నళంబు।
వర్ధితబహురాజవరధార్తరాష్ట్రంబుమహితప్రహర్షితమాధవంబు।
గీ॥ భవ్యకుంతీమహామోదబంధురంబు । సానుజోద్వృత్తయమజాతసంభ్రమంబు।
నగుచుభారతసంహితననుకరించె । మహితమగువనరాజంబుమహిమఁగంటె॥

మఱియును.

* గీ॥ హరితకౌండిన్యగాలవాభ్యంచితంబు । గౌతమాగస్త్యశాండిల్యకౌశికంబు।
శుకముఖాఖిలమునిగణశోభితంబు । నగుచుఁబురుడించెవనముఋష్యాశ్రమంబు॥

మేనక—

† గీ॥ మానినిరొకంటెవనముసుమంగళాభి । శోభియయ్యెనునీచరండాభిశోభ।
గాంచె! మఱియుసతీప్రభఁగాంచిమించి । కంటెకులటాప్రభావసంగతిరహించె॥

మఱియును.

‡ క॥ సరసిజముఖివనరాజము । సురుచిరసరళప్రభావసుందరమయ్యెన్।
బరికించిచూడఁగదుని । బ్బరముగక్లీబానుభావబంధురమయ్యెన్॥

---

పాండురాజు—చేఁదుపొట్ల (శబ్దా) కుమారక=సుతులు—ఉలిమిడిచెట్టు (అభి) ధూర్త=వంచకుఁడు—ఉమ్మెత్త (నానా) కీచక = కీచకుఁడు—బొంగువెదురు (నానా) బృహన్నళ=అర్జునుఁడు, బృహత్=గొప్ప, నళ=కసుపగడ్డి (నానా) వర్ధిత=ఖండింపఁబడిన—వృద్ధినొందిన, రాజ=తాఁటిచెట్టు—రాజులు (శబ్దా) వర=శ్రేష్ఠులు—నల్లదింపెనచెట్టు (శబ్దా) మాధవ = శ్రీకృష్ణుఁడు—వసంతమల్లిక (శబ్దా) కుంతీ=కుంతీదేవి—అందుగుమ్రాను (శబ్దా) ఆమోద= సంతోషము—వాసన, సానుజ = తమ్ములతోఁగూడిన—నల్లతుమ్మ (మంజా) యమ = తుమ్మమ్రాను (శబ్దార్ణవ) యమజాత=ధర్మరాజు, జాత=సమూహము.

* ఇందలి నామములాయాపేర్లుగల మహర్షులకును ఈక్రింద వ్రాయఁబడిన వృక్షములకును జెల్లును. హరిత=కారుమునగ, శాండిల్య=మారేడు, గాలవ=తెల్లలొద్దుగు, గౌతమ=తుమ్మి, కౌండిన్య=పెద్దతుమ్మ, అగస్త్య=అగిసె, కౌసిక=గుగ్గిలపుచెట్టు, శుక=దుందిలపుచెట్టు, ముని=మోదుగు (అభి.)

† సుమంగళాభిశోభి = ముత్తైదువ, సుమంగళా=పాలకూర, నీచ = దుష్ట—పొట్టి, రండా = విధవ—ఆముదపుచెట్టు—ఎలుకజీడిచెట్టు (అభి) సతీ = పతివ్రత—పిక్కచెట్టు, కులటా=ఱంకులాడి—కిరుసెల్లిచెట్టు (అభి.)

‡ సరళ = దక్షిణనాయకుఁడు — సరళవృక్షము, క్లీబ = నపుంసకుఁడు—తగిరిసకూర (అభి.)

వరూధిని—ఓ రంభ! ఓ తిలోత్తమ! ఈ మేనకను ఊరకుండుమనరాదా.

రంభ—దానిమాటలతో నేమి.

* సీ॥ ఊహింపనతతవైదేహీయుతోదారరామలక్ష్మణపరిభ్రాజితంబు।
కౌశికగౌతమాగస్త్యాదిబహుమునీశ్వరతపోన్నతవిభానంశ్రితంబు।
రాజితగుహశబరీజటాయూగ్రమహాప్లవంగప్రాభవాంచితంబు।
వితతపలాశిసంవృతకోమలావనీజాతాహితానిలశాబకంబు।

గీ॥ సంప్రవర్ధితరావణస్ఫారబాణ। సుప్రసాధితమహిళాభిశోభిరామ।
చంద్రవిజయోదయఖ్యాతిఁజంద్రవదన। వనము రామాయణస్ఫూర్తివఱలెఁగంటె॥

వరూ—మీరీవనమును నానావిధంబుల వర్ణించుచున్నారు కాని నాకు.

† సీ॥ పరికింపఁజండకేసరిపరిక్రాంతంబువ్యాఘ్రీచయాధికవ్యాప్తృతంబు।
తిలకింపవివిధదంతిస్తోమధామంబుబహువరాహసమూహబంధురంబు।
భావింపభల్లూకబలసంప్రయుక్తంబుకోకజంబుకనికరాకరంబు।
గణుతింపగర్దభగణసమూపేతంబుమర్కటీకుక్కుటకర్కశంబు।

---

* వైదేహి=సీత—పిప్పలిచెట్టు (శబ్దా) రామ=శ్రీరాముఁడు—సురుగుడుచెట్టు(శబ్దా) లక్ష్మణ = సౌమిత్రి—లక్ష్మణపంజి (శబ్దా) కౌశిక = విశ్వామిత్రుఁడు—గుగ్గిలపుఁజెట్టు (అమర) గౌతమ = ఏనుఁగుతుమ్మి (శబ్దా) అగస్త్య = అగిసె (శబ్దా) ముని = మోదుగు (అభి) తపః = తపస్సు—ఎండకాలము, గుహ = గుహుఁడు—నక్కతోఁకపొన్న (అభి) శబరీ = ఎలుకచెవిచెట్టు (అభి) జటాయు = వటవృక్షము (శబ్దార్ణవము) ఉగ్ర=బెత్తము (అభి) మహా = కోవిదారవృక్షము (శబ్దా) ప్లవంగ = జావ్రిమాను (అభి) పలాశి=రాక్షసుఁడు (అమర) అవనీజాత = సీత—వృక్షము, అనిలశాబకము = తెమ్మెర—హనుమంతుఁడు, సంప్రవర్ధిత = ఖండింపఁబడిన—వృద్ధినొందిన, రావణ = బలరాక్షసిచెట్టు, బాణ = గోరంటచెట్టు, సుప్రసాధిత = సాధింపఁబడిన—అలంకరింపఁబడిన, మహిళా = స్త్రీ—చిలుకవాలుకచెట్టు (అభి) రామ = చక్రవర్తికూర (శబ్దా) చంద్ర = నల్లతుమికి, రామచంద్ర = రాఘవుఁడు. విజయ = తక్కలిచెట్టు.

† కేసరి = సింహము—పొన్న (అభి) వ్యాఘ్రీ = ఆడుపులి—వాకుడుచెట్టు (అభి) దంతి = ఏనుఁగు—దంతిచెట్టు (అమ) వరాహ = పంది—తుంగముస్త (శబ్దా) భల్లూక ఎలుఁగు—మహిసాక్షి (అభి) బల = గుంపు—ఏలకిచెట్టు (అభి) కోక = తోఁడేలు—కొండగోగు (అభి) జంబుక = నక్క—మొగిలి (అభి) గర్దభ = ఒకమృగవిశేషము—దేవతాళ

గీ॥ తీవ్రకైరాతకోగ్రభిల్లీవ్రజైక । భూరిహుంకారవారప్రపూరితంబు।
నగుచు నీప్రమదారామ మతివలార । క్రూరమృగమృగయారణ్యఘోరమయ్యె॥

మఱియును.

* గీ॥ వనము భూతనిలయ మనఁగ పిశాచీవ్ర । జంబు మోహినీచయంబు క్రూర।
శాకినీగణంబు కీకసమాంసర । క్తంబు నగుచుఁ భయదగతిఁ దనర్చె॥

† క॥ వారాహియు బ్రాహ్మియుఁ గౌ । మారియు నింద్రాణి మఱియు మాహేశ్వరియున్।
గ్రూరమహాఘోషాశ్వేత । భూరితరాకృతుల వెలయఁ బూనుటఁ గంటిన్॥

‡ గీ॥ ప్రాకటాగ్నిముఖియు ఫణిజిహ్వయును నా । సికయుఁ దీక్ష్ణగంధ సింహముఖియు।
రూఢిగ నికరాళరుధిరాతిచిక్కణ । స్థలుల నిలిచి మనముఁ గలఁపఁ జొచ్చె॥

§ క॥ చండీప్రకాండఘోషము । ముండీక్ష్వేళాప్రచండముల్ విస్తృతకూ।
ష్మాండకరాళహాసో । ద్దండము నై వనము మిగుల దారుణమయ్యెన్॥

---

ము (అభి) మర్కటీ = ఆడుకోఁతి—నీరుతుమికి (అభి) కుక్కుట = అడవికుక్క—ఊడుగు (అమరనానా) కర్కశ = కలుకైప—కసింద (అభి) కైరాతక = కిరాతసమూహము—నేలవేము (అభి) భిల్లి = అంత్యజాతి స్త్రీ—పెన్నేరు (అభి) హుంకార = హుంకార ధ్వని—ఆరుదొండ (అభి.)

* పిశాచీ=కారుమినుము, మోహినీ=ఉమ్మెత్త, శాకినీ=తోఁటకూర, క్రూర=పోఁక చెట్టు (అభి) కీకస=నానావిధక్రిమిజాతులు (శబ్దా) మాంస=జటామాంసి (శబ్దా) రక్త=ములు మోదుగు (అభి.)

† వారాహి=నేలతాడు (అభి) బ్రాహ్మి=గంటుభారంగి (శబ్దా) కౌమారి=ఈశ్వరి తీఁగె (అభి) ఇంద్రాణి=వావిలి (అభి) మాహేశ్వరి=యువతిక్తవృక్షము (శబ్దా) క్రూర=పోఁకచెట్టు మహా=దేవదారు, ఘోషా=సదాప.

‡ అగ్నిముఖి = పెన్నేరు, ఫణిజిహ్వ = పెద్దపీచర, అనాసిక=అనాసుగడ్డ, తీక్ష్ణగంధ = మునగ, సింహముఖి=అడ్డసరము, కరాళ=నల్లగగ్గెర, రుధిర=ఇల్లింద, చిక్కణ = పోఁక—నునుపైన.

§ చండీ = రేగు—చండీగ్రహము, ప్రకాండ = నల్లపువ్వులనీరుల్లి—సమూహము, ఘోష = పెద్దనదాప—గొప్పధ్వని, ముండీ=బోడతరము—ముండియనురక్కసి, క్ష్వేళా=చేఁదుబీర—సింహనాదము, ప్రచండము=ఎఱ్ఱగన్నేరు—భయంకరము, కూష్మాండక=గుమ్ముడు—కుష్మాండగ్రహము, కరాళ=నల్లగగ్గెర, హాస=తెల్లగన్నేరు.

ఇంక నీ వనవిహారము చాలును. నేనిట నిలువఁజాలను. ఇంటికేగద.

మేనక—వరూథినీ! నీకోర్కెలీడేరు సమయము తటస్థించినది. ఆతురమెందుకు.

వరూథిని—మాయమ్మ నీ సహవాసము చాలును. నీవూరకున్న మేలు.

మేనక—రంభాదులమాటలు గాలిమాటలు. అవి నీకు రుచించినవి గాఁబోలు. ఈ నా మాటలాలకింపుము.

క॥ సారఫలాగమయోగవి । చారప్రవరద్విజప్రచారంబగుమన్ ।
సారసముఖి వనమల రెను । దారతనరుణాస్పదాభిధానాగ్రగతిన్ ।

వరూథిని—అదుగో నీమర్మోద్ఘాటనంబులు నీ వెందుకు మానఁగలవు. నీపరిహాసంబులకిదే నా సమయము.

మేనక—చెలి నా వాక్కులు పరిహాసకంబులు కావు. ఇట నాచేబడిన్ జూడుము.

వరూథిని—(అట్టిట్టి చూచి) ఆహా! నా ప్రవరుండట నున్నవాఁడు.

అని మాఱుబలుకక అకుహనా భూసురుండున్న యెడకు పరుఁగెత్తుచున్నది.

వరూథిని—(ఆకపట భూసురకుమారుని ప్రవరుని గా భావించి రెండుచేతులు బట్టుకొని)

క॥ ఏలరకను మొఱఁగితివిది । చాలురయురములలంపఁజాలురతాళన్ ।
జాలరబాలరగోలర । యేలరయీశంక లింక నేలరనన్నున్ ॥

క॥ సోలెనొడలశ్రుజాలము । వ్రాలెకదున్ జాలుగట్టిపడెఁ బ్రాణంబుల్ ।
డీలెవికసోర్వనేటన్ । గోలెనమన్ రతులవేలికొనమతికరుణన్ ॥

క॥ చేరితివిటనినునరయఁగఁ । జేరితినిను నెల్లయెడలసిగ్గతిమతి నే ।
పారితినినుఁగనియిటకున్ । బారిలికరుణించినన్నుఁ బాలింపుమికన్ ॥

క॥ చిక్కితిఁ జింతాభరమున । స్రుక్కితివిరహానలమున సుందర నీకున్ ।
దక్కితిమోహావశంబున । మ్రొక్కితిని దెనను వరింపుము నన్నుమింకన్ ॥

(ఇంతలో రంభాదులందఱు అచ్చటికి వచ్చుచున్నారు.)

వరూథిని—వీఁడె నామనోహరుఁడు. చెలియలారా! చూచితిరా నా పలుకులిప్పుడైన నమ్ముదురు కదా.

రంభ—

సీ॥ ఏమిరామాయలనేకముల్పచరించియుబలనిట్లగడుసేయంగనగునె ।

మేనక—

నెఱజాణవౌదువీవరమఱలెనయక చెలియకుసిపమెత్తఁజేసితౌర।

ఊర్వసి—

టాటోటుకాఁడవీటక్కులేటికిమునుమున్న మాచెలిఁగూడ మొనయవలదె।

తిలోత్తమ—

కాంతనుఁగలయు సౌఖ్యము చవిఁగాంచుము త్రోపుడులకునైనఁదొలఁగవవల।

రంభ—

గీ॥ వలపుఁబనులును జపములు పలుపుఁబనులు । సమతఁదార్కొను సౌలభ్యమమరె నీకు।
నింకఁబిరుపేఁకు లేటికీ పంకజాక్షి । నేలిబహు సౌఖ్యవారధిఁ దేలవలదె॥

ప్రవరుఁడు—ఆహా! ఏమివాతల వ్రాత. వేదోక్తంబులగు సమస్త సత్కార్యంబు విడిచి స్త్రీ కాముకుఁడనై రతిలోలుఁడనై దుర్భరంబగుఁ గాలంబుఁద్రోయవలసివచ్చెనె. అయ్యో! దైవమా.

ఉ॥ నీరజగంధులార జవనీ జనకుల్ గడునార్తిఁజెందవా।
దారసుతాదులేను జనుదారి నెఱుంగనివంతఁగుందనీ।
భూరిధరాధరోగ్రవనభూములనీగతిఁజిక్కిస్రుక్కినా।
కీరమణీలలామపయి నెట్లు విరాళిజనించుఁజెప్పరే॥

మ॥ కలకాలంబు మహాతపోనియతినీ కాంతారవాటిన్ విని।
ర్మలభావంబుననుండువాఁడన నవాచందంబు నాబోఁటికిం।
దులభింపన్ జనదంచుఁదోఁచెవినుఁడెందున్ దుఃఖసంతాపసం।
చలితస్వాంతున కట్లు చేకురుఁదపశ్చర్యాదికార్యావళుల్॥

శా॥ నానాకావ్యపురాణశాస్త్రములు నానావేదవేదాంతముల్।
నానాభావ్యవిశేషముల్ దలిసి నానానూనృతాపాద్యనా।
చానాచారము లెల్లఁబోనడచియీ శ్యామామణిన్ గూడనా।
నానూనాంతర సంశయంబులు మదిన్ వ్యాలోలమున్ గొల్పెడిన్॥

మ॥ ఇలు సేరన్ జని నాకుఁగూర్చు సతి నాయిల్లాలి నాచాన నా।
లల నారత్నముఁగూడి మాడిమనఁజాలన్ లేని నాడీగుహా।
వలులన్ గాలముఁద్రోయుటొండెనిటనీ వామాక్షికిన్ జిక్కిని।
స్తులసౌఖ్యోన్నతిఁగాంచుటొండెయగుఁజేతో వీథినూహించినన్॥

వ. ఏమియుఁ దోఁచక డోలాయమానంబగు మానసంబు ద్వాపరంబను సుడిఁ బడి గిరగిరఁ గిఱికొనుచున్నయది. ఏమిసేయువాఁడ. నయ్యో! అహో! దైవమా (అని యేమియుఁ బలుకక కనులుమూసుకొని యూరక నిలుచుకొనుచున్నాఁడు.

రంభ—(ప్రవరుని భుజములుపట్టి యూఁచుచు) ఏమిది ఈ సంశయంబులు చాలు. నీకుఁ దోచకున్న కిట్టది కర్తవ్యంబని తెలియఁ బలుకఁగల హితవరులమగు మేమంద రమును నీకుఁదోడుపడియుండ నీవిటు యోచించెదవేల. ఇప్పటికి మావరూధినిఁ గూడి సుఖంబుండి కాలాంతరంబున నిలుసేరు నుపాయంబు వేచి యుండుటయ తగినకార్యంబు. ఇందుననీకుఁ బాపంబుకలుగదు. కలిగినచో జపతపాదుల దానిఁ బాఁపికొను సామర్థ్యంబు నీకుఁగలదు. ఇది నీకుఁ దోఁచదయ్యెఁ గాఁబోలు. సూర్యాస్త మయంబుకావచ్చె. వరూధిని మందిరంబుఁ జేరఁబోదము రమ్ము రమ్ము.

ప్రవరుఁడు—చెలులారా! నేనును నానావిధంబుల నాలోచించితి నైనను మీపలుకులఁ గైకొననాకు మనస్సొగ్గదు. పాపభయంబున సంచలించుచున్నది. నేను మీకోరికలీడే ర్చువలెనను నభిలాష మీకు అనివార్యంబుగఁ గలదేని మీచెలియుకుఁ సంతోష ముఁ గలుగఁజేసిన పుణ్యమునాకును అందువలనంగలుగుఁబాపము మీకును జెందఁదగి నదని మీరందఱును మాటయిచ్చిన నేనూకొనియెద. నిందుకు మీరేమందురో వినఁ గోరెద వచింపుఁడు.

రంభాదులు—ఆపాపము మాది. చింతింపకుము పోదము రమ్ము.

(అని అందఱును ప్రవరునిఁ జేతులుపట్టుకొని పిలుచుకొని వెడలిపోవుచున్నారు.

ద్వితీయాంకము సమాప్తము.

---

శ్రీరస్తు.

# స్వారోచిషము.

## తృతీయాంకము—ప్రథమరంగము.

వరూధిని యుద్యానవనము.

[ప్రవరవేషధారియగు గంధర్వుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

ప్రవ—(తనలోఁదాన పల్కరించుచు.)

క॥ ఏమిరమణిమంతమహా । సామర్థ్యముగల్గు మేటిసాహసివిబళా।
నీమహిమనీవయెఱుఁగుదు । నీమానినినొంచఁగల్గితేమనవచ్చున్॥

క॥ సురగరుడోరగవిద్యా । ధరపన్నగయువజనాళితనువలచినఁదా।
సరకుఁగొనదీతలోదరి । పరమాశ్చర్యముగనీదుబారికిఁజిక్కెన్॥

సీ॥ ఔరౌరదైవమాయావిశేషముమహాచిత్రమటంచువచింపఁగంటి।
తప్పకనీదుసత్యప్రతిజ్ఞాపూర్తి నెఱవేర్పఁజాలినవేర్పుఁగంటి।
సంతతాత్యంతప్రశస్తసౌరతసౌఖ్యసముదితానందసంభ్రమముఁగంటి।
కంతుజయంతువసంతుఁబోలినసుకుమారసుదారుఁగుమారుఁగంటి।

గీ॥ కులసతినిఁబాసి వెలివలపులకుమరఁగి । వెరవరివటంచుసఖులెల్ల వేవిధములఁ।
బొగడనరిదివలంతివై నెగడఁగంటి । నొచ్చె మెఱుఁగకనినునీవ మెచ్చఁగంటి॥

ఓరి నీవును మిగుల పౌరుషముగల యొకమానిసివని యిప్పుడుకదా నేనునమ్మితిని. ఆ సహాయసామర్థ్యము. అనన్యసామాన్యమాన్యసాహసాతిశయము. అదృష్టపూర్వచమత్కారయావిశేషము అనునవి నీసొమ్ములుకాని యితరులవికావునుమ. ఇది నిక్కము.

(అని కొంతసేపు యోచించి.)

ఇఁక నేనిటనుండుటతగదు. నా కపటోపాయంబు బయలువడినఁ గడునిందకుఁ బాత్రుండనగుదు. మంచిది. నేనిట్లు యోచింపనేల! అట్టే ఆలోచించి చూచినచో.

సీ॥ నేనీసరోజాక్షిఁబూనివంచించితిననినన్నునిందించుఘనుఁడెవండు।
తండ్రిచిత్రాళ్వుండుతమివాపఁజాలక తెఱవలవెను వెంటఁదిరుగుచుండు।
గురుఁడుబృహస్పతికొంకకగ్రడానిపూబోడిఁబట్టినముదిబోజుఁగుదిట్ట।
రాజుమిత్రాముందురహీనహల్యనుఁగూడఁగోడిరెయికొక్కెలుగూసెమున్న।

గీ॥ మొదలివేలుపులల్ల త్రిమూర్తులరయ । నాత్మజాసక్తిగోపీజనానురక్తి।
మునివధూయుక్తిమోహాబ్ధిమునుఁగువార । లాపరబ్రహ్మనిర్గుణుండలుగఁడతఁడు॥

కావున నీ యపవాదమునకు నే జడియను. అది యటుండని. నా కపటనాటకమును బహుకాలము బయలువడనీక యనేక మాయోపాయములచే రక్షించితి. యీగుట్టు నాకులసతికిఁ దెలియవచ్చినట్లు తోఁచుచున్నయది. ఇంకనుం దడసినచో.

గీ॥ చంచలాక్షి నాదువంచనచెలిఁగి । పించుననుచుఁబరితపించెమనము।
పొంచిమించుఁబోడివంచనోక్తులనమ్మ । తించిపంపుననువుఁగాంచవలయు॥

మంచిది. శీఘ్రకాలంబునన లొంగి చనుసదుపాయంబు యోచించిచూచెద.

(అని నిష్క్రమించుచున్నాఁడు.)

ప్రథమరంగము సమాప్తము.

## తృతీయాంకము—ద్వితీయరంగము.

వరూధిని మణిమందిరము.

[వరూధిని ప్రవేశించుచున్నది.]

వరూ—ఏమి యీవిచిత్రము. నాప్రియుండగు ప్రవరుండెచటనుఁ గనరాకున్నవాఁడు. గృహారామసీమనున్నవాఁడు కాఁబోలు. ఆహా! ననువిడిచి యొంటిగనెప్పుడుఁ బోవువాఁడుకాఁడు. పోయిచూరసెదఁ గాక.

(అనియుద్యానమునఁగలయఁజూరసివచ్చి.)

[ఆహా! ఏమి యీయాశ్చర్యము. కేళీగృహంబున నున్నవాఁడో.]

అని కేళీగృహంబుఁజొచ్చి అట హంసతూలికాతల్పంబున నిందుముసుంగిడి పరుండియున్న ప్రవరుంగని ముసుంగుఁదొలఁగఁదీసి చిన్నబోయియున్న యతనిమొగంబుఁగని చింతించుచు శోకబాష్పంబులురుల గద్గదస్వరంబున.

వరూ—ప్రాణనాయకా! ఎందుకీచిన్నఁబాటు. ఏల ఈవిచారము. చింతాక్రాంతమనస్కుండవై పరుండుటకుఁ గారణంబెద్ది. మంజులతేజఃపుంజరంజితంబగు నీముఖకంజమున నీ ఖిన్నభావమావహిల్ల హేతువెయ్యది. నాయందింమఁ్తంతలోపమున్న నన్ను మన్నించి కరుణారసతరంగితంబులగు నపాంగవీక్షణంబుల నీక్షించి రక్షింపుము. నీవి

రీతి విన్నఁబోయి పల్కరింపకుండుటకు వగచుచు నేమియుఁ దోఁచక దిగ్భ్రమనొంది మనకుమారుండేడ్చుచున్నవాఁడు. చేరఁదీసి యంకమునఁ జేర్చి ముద్దిడి లాలించి బుజ్జగింపుము. అయ్యో! ఏల యీయాలస్యము.

ప్రవ—ఆహా! శ్రీహరీ (అని వెచ్చనూర్చుచు) ప్రాణనాయకీ ఏమని వక్కాణింపఁగలను. నేడు నేనొంటిగ మనయుద్యానవనంబునఁ ద్రిమ్మరుచుండ నేను బూర్వంబునఁ గనియున్న సిద్ధపురుషుండు ననునారయుచు నచటికివచ్చె. అతఁడు నన్నుఁ జూచువేడుక వరుణాస్పదపురికిఁ బోయియుండి మద్గృహంబునకు విచ్చేసియుండెనట. అచటి వార్తలన్నియు నతండు జెప్పవింటిని. ఆపలుకులాలకించిన దేహంబు జర్ఝరీభూతంబై మానసంబు దోధూయమానంబై యేమియుఁ దోఁచకున్నయది. నేనీరీతి నిట నిలుచుట కామహామహుండు కోపోద్దీపితమానసుండై.

సీ॥ కనుచూపులుడుగుమాగాళ్లముప్పుఁదలిదండ్రులార్తినలంగితలఁకుచుండ।
తీరనిసంసారవారధివరిగానకవలుచునిల్లాలుమిడుకుచుండ।
చదువుసంధ్యలుగానకదనుదప్పినసుతచ్ఛాత్రులాటలఁబడిజరుగుచుండ।
పౌరిఁబౌర్విపైపరామరికచాలమిగొడ్డుగోదలుబండెలఁగూలుచుండ।
గీ॥ కలుపువిడఁదీసితత్తినీరుగట్టకునికిఁ । బొలములెల్లనుజెడిపాలివ్రాలుచుండ।
నోయియిటునిల్వనీమనసొగ్గెనెట్లు । కట్టడివిపాపివీవనిదిట్టెనతఁడు॥

క॥ క్షితిఁజననీజనకులనతి । సుతులనుబంధువులసఖులసురపూజాది।
వ్రతములజపములఁదపములఁ । బతితుఁడవైమఱచితనుచుఁబరుసములాడెన్॥

వ. మఱియు నీయన్నిదుర్దశలకును నాతండ యాదికారణంబగుట తద్దోషనివారణార్థంబు నన్నుఁ మఱల నాయింటికిఁ బనుచువాఁడై యిప్పుడ కదలిచనుమనియును నటుసేయకున్న ఘోరశాపంబిడి భస్మీభూతునిఁగాఁ జేయువాఁడననియును నిష్ఠురోక్తులువచించె. నికఁ దడయుట కార్యంబుగాదు. వెడలిపోవువాఁడనని తలంచిన.

సీ॥ తొలుదొల్తననుఁ గాంచివలపులూరఁగముచ్చటలువల్కఁజగజంపుఁగలికితనము।
వనముననురోసికనిదీనవాక్కులదక్కితినీకనిర్మొక్కువలపు।
మనికితమంతంతమునుమున్నకనిదానివదలకసవరించువలఁతినేర్పు।
కన్నపాపనిఁదెచ్చికానుకగొనుమంచునంకంబుఁజేర్చునెయ్యంపుఁగలిమి।
గీ॥ మేలమునకనితగనింటమెలగకవలఁ । గనుమొఱంగినవెంతయుఁగళవళించి।
వరగనారసియెదఁబూనుసంభ్రమంబు । మదిఁదలంచినవామోదమొదవునెపుడు॥

క॥ ఆరయ నస్మద్దేశా । చారంబని పలుక సురత సమయంబునఁ జె।
న్నారఁగ వెఱదిరఁగవల । పూరఁగ గనులార మాయ నోర్చితి వబలా॥

సీ॥ గడియ కొక్కొక చీరఁ గట్టి రైకను మార్చి వలపులూరఁగ మ్రోల నిలుచు నీటు।
రైక సడల్చి యారజఁపు చీనాజిల్గు వలువఁ దాల్చుచు మ్రోల నిలుచు జగ్గు।
జాళువా రతనంపు మేలి సొమ్ములు దాల్చి తళుకు లొల్కఁగ మ్రోలఁ గులుకు నిగ్గు।
తొగరు గండఁపుఁ దావి నెగడుఁ బూసరులు కొప్పున ఘుమ్మురన మ్రోలఁ బొసఁగు శోవి।
గీ॥ సూనులావణ్య విభవ నిదాన నెత్తి । కొని నిజాననమున వాని గొనబు మోము।
వెలయ నరగంటననుఁ జూచి యలయు సొబగు । మదిఁ దలంచిన గగురు పాటొదవు నిపుడు॥

(అని తనకుమారు నెత్తుకొని ముద్దిడుచు.)

సీ॥ పురుటింటఁ జేటనిద్దురఁ జెందుఁ జిఱునూనెకందువుఁ గని ముదమందియుంది।
ఒయ్యనొయ్యనఁ దూఁగుటుయ్యెలలో నాడు చిన్నపాపని చిన్నె లెన్ని యెన్ని।
కాకపక్షము లొలిఁ గదలఁ జిందులు ద్రొక్కు కలికి కుఱ్ఱని గని చెలఁగి చెలఁగి।
బుడిబుడి పడిఁ దప్పటడుగుల నడయాడు బుడుత నిగని మురిఁ బొంగి పొంగి।
గీ॥ నాయనా యంచు మఱియొ యమ్మా యటంచుఁ । బలువజును మఱుఁ బిలుచు మఱుఁ బ్రియంబు।
మాకు మాసినఁ బురుడించు మాకు మాకు । నంప ప్రాణంబు లిరవొందు నందు నబల॥

వ. అయ్యో ప్రాణనాయక నీ సంయోగంబున.

సీ॥ భావింప బహుపూర్వ్యథవమాన్యతా మోఘ నలరూపమగు మహాపదవిఁ గంటి।
తిలకింప దేవాదిదేవతావరుల కగ్గము కాని బహుసౌఖ్య గరిమఁ గంటి।
పరికింపవర నిరంతర సంతతాత్యంత హర్ష వారధి నోలలాడఁ గంటి।
తలపోయ సప్త సంతానోత్తమంబగు ప్రాపు సాపత్యంబు బొందఁ గంటి।
గీ॥ వెలతమత్పుణ్యనిధివగు నిన్నుఁ గంటి । బడిబడిన యిల్లభోగముల్ బడయఁ గంటి।
స్వర్గమును గంటి మఱి సురత్వంబుఁ గంటి । నీవు ననుఁ బాసి కొన నెట్లు నేర్తు నబల॥

క॥ రోయక కనుమూయక కవఁ । బాయక ప్రేమాతిశయము మపారముగఁ దను।
చ్ఛాయవలె నంటి నను దొర । తీయని బహుసౌఖ్యవార్ధిఁ దేల్చితివి కదుల్॥

క॥ ననుఁ బాగడ మఱియ నీవుఁ । మును దీపపవాతిరంబె ముదితరో కపుంగా।
ననుఁ బను పుముకొంకకుమెం । దును పచ్చుచుఁ బోవుచుందుదుల్ మదనమొదవ॥

వరూ—(నిట్టూర్పు నిగుడించుచు కన్నీరు నించి)
మనోహరా అయ్యో అకటకట నిను నెట్లు బాయనోర్తు.

సీ॥ వినువకయింటింటవెనువెంటఁదగసంచరించుచుననుబల్కరించుఁబ్రేమ।
ప్రొద్దుపోకకునికుబ్రొద్దునునోర్చినన్విడువకజంటగాఁగుడుచుకరుణ।
క్షణమాత్రమేనింటఁగనుమొఱంగినఁదాళకటునిటునింటింటనరయునెనరు।
సతతంబునామాటజవదాటకిష్టార్థమొనగూర్పసరగనూకొనుఁబ్రియంబు।
గీ॥ జిలుఁగువెలిపల్వమెయినంటజలకమాడు । సమయమారసియాకలిసాకుబూని।
సరసమాడుమస్నానంబుసలుపువలపు । మరవనోస్తునెనినుఁబాసిమాన్యచరిత॥

క॥ చిత్రమునకుభిత్తికసత్ । పాత్రతకున్ వినయవిద్య ; పటుసౌరభమై।
చిత్రికిసుమ ; ముంబుజదళ । నేత్రకుఁబ్రియుఁడుండయనుటనిక్కముతలఁపన్॥
సీ॥ నానానునయవాగ్విధానాభిసూచితానూనానురాగాతిమానితంబు।
హేలావిలోలవేలాలాలితానంగలీలాసమాదృతాలింగనంబు।
సారాంబుపూరకాసారాభికలితవిహారాతతానందపూరితంబు।
స్యూతాభిజితపాత్రావాతానుగతవాదజాతాంబరాంచలసంగ్రహంబు।
గీ॥ సాంద్రతరచంద్రికాసౌధచంక్రమంబు । గాంగసైకతసంచారసంగతంబు।
మంజువనకుంజహేవాకరంజితంబు । నీసమాయోగమోమహనీయమూర్తి॥
గీ॥ కపటనిద్రాప్తిఁగనుమూసికదలకుంట । నెఱుఁగకటునిటువలపులునెఱపిగుసు।
పాటుఁగనికొంకుసనుఁదార్చిబాళిఁగౌఁగి । లించునీమేలములుమదినెంచఁదరమె॥
గీ॥ అలికమునఁజారెఁగస్తూరితిలకమనుచు । దిద్దిసవరింతునిటరమ్ముతేఅవయనుచు।
నెపమువెట్టుచునాద్రోలనిలిచికావి । మోవిముద్దిడఁజేయునీమోహమనఘ॥
క॥ హారములుచిక్కువడెనిటు । రారమ్మనిచేరికడుఁబరామరికనెపం।
బారసిగిలికముడివడి । జారుచునెఱజాణవీవుసామాన్యుఁడవే॥
క॥ నీమృదుమధురతరోక్తులు । నీమహనీయాభిరూప్యనిరుపమతారు।
శ్యామలశోభాదికములు । నామానసవీథినాటిననుసలయించున్॥

నేను నినుబాసి మేనఁబ్రాణంబు లొకక్షణమాత్రమైనను నిలుపఁజాల. నన్నుఁద్రోచి పోఁజూడకుము. నీపాదంబులాన నేనిటనిలువనోప. నీవెంబడినవెడలివచ్చుదాన. నన్నుఁ గరుణించి తోడ్కొనిపొమ్ము.

ప్రవ—వరూథినీ నీకుమద్విరహ చింతాభరంబున యుక్తాయుక్తంబులు తేటపడకున్నయవి. నాజననీజనకులును భార్యాపుత్రులును నివసించునెడకు నిన్నుఁ దోడ్కొనిపోవుటతగునా. ఎందుకిట్లు మూర్ఖమవలంబించెదు. నిన్నుఁడఁబాసి నేనాప్రాణంబులు భరియించువాఁడ. ఏల యీభ్రాంతి. సిద్ధపురుషునికాపోక్తిఁదలంపుము. యూరక సముఁబోవ

నంప్రము. అతండు ముందు నాకొసంగియున్న పాదలేపనౌషధిప్రయోగరహస్యంబు లాద్యంతమామహామహుఁడు నాకనుగ్రహించియున్న వాఁడు. నీయిచ్ఛకు వచ్చునట్లు వచ్చుచుఁ బోవుచుండెద. చింతింపక యూరిడి సుతుని రక్షించుచు మదాగమనంబు నిరీక్షించుచు సుఖంబున నిటనుండుము. పోయివచ్చెద.

(అని కదలుచున్నాఁడు.)

వరూ—ప్రాణనాయకా! భవజ్జననీజనకుల సంతాపంబుఁ గూర్చి నేనంతవగవను. సిద్ధవరుని శాపంబునకు జంకి చింతిల్లుచున్నదాన. శీఘ్రకాలమున మఱలివత్తునని వాగ్దానము చేసిన నిప్పటికి సమ్మతించుదాన.

ప్రవ—తథాస్తు అట్లనె. (అని నిష్క్రమించుచున్నాఁడు.)

ద్వితీయరంగము సమాప్తము.

## తృతీయాంకము—తృతీయరంగము.

వరూధినిమణిమందిర ప్రాంతభూమి.

[ఘోరాకారంబగు నొక్కసింహమునుబట్టుకొని వరూధినికుమారుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

వరూ—(భయపడి దూరమున నిలువంబడి) బాలకా! మహాక్రూరమగు నీకంఠీరవముతో నేమి యీయాటలు. చాలుఁజాలు వదిలిపెట్టుము.

బాలకుఁడు—నేనువదలను దీనిపైఁగూర్చుండి వాహ్యాళిసలుపువాఁడ.

వరూ—అయ్యో బాలకుఁడు మూర్ఖుఁడు. కంఠీరవము మహాభయంకరము. నేను స్త్రీమాత్రను. దానిఁ జూడ భయమగుచున్నయది. అడ్డపడి దీని విడిపించి బాలకుని నొప్పగించు వారెవ్వరును లేరు. ఆహా దైవమా ఏదిగతి.

ప్రముఖుఁడు—ఎవ్వఁడీమూర్ఖుఁడు. బాలమాత్రుఁడుగనున్నను కాత్యాయనీదేవికి వాహనంబగు నీకంఠీరవంబును బట్టియున్న వాఁడు. విడిపించెద.

(అని యాబాలకుని భర్జించుచు సరసకుంజని వాని దుర్నిరీక్ష్యంబగు తేజఃపుంజమునకు వెఱఁగుపడి వెనుదిరిగి )

ఆహా ఏమియీవిచిత్రము. యీబాలుండెక్కడ. భయంకరాకారంబగు నీకంఠీరవం బెక్కడ. నవుఁ బోటివానిఁ భర్జించి తిరస్కరించు టెక్కడ. దీని నాద్యంతము నా చండికాదేవికెఱుంగించెద. (అని వెడలిపోవుచున్నాఁడు.)

చండిక.—(బాలునిఁజూచి యాశ్చర్యపడి) ఈబాలుం డెవఁడు. బాలభానుప్రభాభాసమానుండై వెలుఁగుచున్నవాఁడు.

(అనినలుదిక్కులు చూచి వరూథినింగని.)

వరూథినీ నీవిటనుండఁ గారణంబేమి. యీకుమారకుం డెవఁడు.

వరూథిని—

సీ॥ జయజయశతకోటిచంచలాంచితదకచ్ఛకితప్రభావిభాస్వత్స్వరూప।
జయజయకమనీయచంద్రికారుచిధళోంధళితార్ధచంద్రకసత్కలాప।
జయజయహరివిరించనముఖాఖిలకామితార్థప్రపాలనేచ్ఛాప్రతీప।
జయజయమహిషరాక్షసఘరాధరకూటపాటనాటోపశంబప్రతాప।
గీ॥ జయసమస్తచరాచరజగదలంఘ్య । సంతతాత్యంతచండశాసననిరూప।
జయమహోదుర్గ భవదంఘ్రిజలజములను । శిరమునధరింతునను బ్రోచుఁగరుణజూప॥
సీ॥ అంజలినిత్యనిరంజనచర్యాభిరంజితమహిమాప్రపుంజనీకు।
వందనంబులుశతానందముఖ్యామరబృందవంద్యపదారవిందనీకు।
దండంబునిశితప్రచండత్రిశూలాభిఖండితరక్షఃప్రకాండనీకు।
సాష్టాంగమత్యంతదుష్టశిక్షణసదాశిష్టసంరక్షణాభీష్టనీకు।
గీ॥ ప్రణతిచతురంగకేళికాప్రణయకలహ । వినతసాంబజటాజూటవిగళితాభ్ర।
గాంగజలకృతపాదసంక్షాళనాను । జాతమహితప్రహర్షసంప్రీతనీకు॥

జగజ్జననీ యీచిన్నపాపఁడు నా కుమారుఁడు. బాల్యచాపల్యంబున నీకు వాహనంబగు నీకంఠీరవంబుఁ బట్టి తెచ్చియున్నవాఁడు.

క॥ బాలుఁడుమతిచాంచల్యవి । శాలుఁడుఖగమృగవిహారసహితక్రీడా।
లోలుఁడుబహుమధురవచో । జాలుఁడురక్షింపుమమ్మశాంభవివీనిన్॥
క॥ అంబవురక్షితలోకక । దంబవురక్షఃకులాద్రిదళనోగ్రమహా।
శంబవుబహుసంప్రీణిత । సాంబవుకరుణింపుమమ్మశాంభవివీనిన్॥
క॥ నతివినదభంగమగంళ । వతివివినాయకకుమారవరవిభవమహో।
న్నతివిపక్షీకృతమాభా । రతివితగన్ బ్రోవుకనికరమునమృడానీ॥

చండిక—వరూథినీ! నీభక్తి వినయంబులకు మెచ్చితి. నీపుత్రోదయంబింతయని వక్కాణింప నసాధ్యంబు. అని ఆ బాలకుచేరంజని సింహమును విడిపించి వానిచేయిపట్టి వరూధిని కొప్పగించుచు వరూధినీ! వీఁడు నీకుమారుండగుట నీజన్మంబు పావనంబయ్యె. ఈబాలుండు స్వకీయంబగు రోచిస్ఫురణంబున మిరుమిట్లు గొలుపుచు దుర్నిరీక్ష్యుండై

దిక్కులం వెలుఁగించుటఁ జేసి వీఁడులోకంబున స్వరోచియను నామంబునఁ బ్రఖ్యాతి వహించి మనోరమయను కన్యకామణిఁ బెండ్లియాడి స్వారోచిషుండను నొకమహా మహునిఁ గుమారునిగఁ బడసి సకలదిక్పాలకపాలకుండై జగత్ప్రసిద్ధినొందు. ఆకుమారుండును స్వారోచిషమను మనునామంబున మన్వంతరాధిపతియైయుండు. ఇప్పుడిక్కుమారుని నివాసార్థంబు.

సీ॥ పరిఖాట్టసాలగోపురచతుఃప్రాచీరరథ్యావిపణికావిరాజితంబు।
సౌధహర్మ్యాగారచైత్యసంజవనమండపమందురామతాడంబరంబు।
కుసుమఫలామోదగుంభితబహునిష్కుటాంతరదీర్ఘికాభ్యంచితంబు।
సర్వజనానందసౌఖ్యసంధాయకసకలవస్తుసమృద్ధిసంభవంబు।
గీ॥ మహితబహుమంత్రిమండలమండితంబు । దండనాయకముఖవీరదర్పితంబు।
వందిమాగధనటనటీవైభవంబు । భోగినీనామకంబగుపురవరంబు॥

ఇట మదనుగ్రహప్రభావంబున నుత్పన్నంబై.

సీ॥ హంసాశ్వమతిభూతిహంసాశ్వగతిరీతిఁ జూపనేపారుభూసురులుహయులు।
ప్రబలదానస్ఫూర్తి ప్రబలదానస్ఫూర్తిఁ బరిపూర్తిఁగను రాజవరులుకరులు।
మణిచక్రవిభవంబుమణిచక్రవిభవంబుగలుగువైశ్యులుశతాంగములగములు।
ప్రత్యర్థివర్ధనప్రత్యర్థివర్ధనోద్భటశూద్రతతిరణోద్భటులుభటులు।
గీ॥ దంబులగతినొప్పఁబంబుతరసంభ్రమాభి । లలితసుమసౌమసౌక్షపల్లవనికుంజ।
రంజితారామరామాభిరామమగుచు । నొఱఁగునమరావతీపురి నెనయుమహిమ॥

అప్పురంబున సకలసుఖంబు లనుభవించుచు నీవును నీకుమారుండును సుఖంబుగనుండుఁడు. భద్రంబయ్యెడు పోయివచ్చెద.

(అని నిష్క్రమించుచున్నారు.)

(ఇది తృతీయాంకము.)

శ్రీరస్తు.

# స్వారోచిషము.

---

## చతుర్థాంకము—ప్రథమరంగము.

### స్వారోచిసభాస్థానము.

[స్వారోచి తనగురుమంత్రి దండనాథప్రముఖులతో నిండియున్న యాస్థాన మండపమును బ్రవేశించుచున్నాఁడు.]

గురుఁడు—

సీ॥ స్వస్తి సమస్తాతినిస్తులదేవేంద్రవిస్తారవిభవప్రశస్త మీకు।

మంత్రి—

అంజలిలోకైకమంజులాంచన్న్యాయరంజితస్మితప్రపుంజ మీకు।

దండనాయకుఁడు—

దండంబు బహుశత్రుమండలదండనాఖండచండదమ్యాప్రకాండ మీకు।

కార్యదర్శి—

సోహారసుజనసమూహావనైకసన్నాహయుతాశయోత్సాహ మీకు।

కుడిప్రక్కనున్న వేత్రహస్తుఁడు—

గీ॥ ప్రబలినిజసర్వనాగతప్రణతదిగధి। పాలకరుణాప్రసాధితప్రణయ మీకు।

ఎడమప్రక్కనున్న వేత్రహస్తుఁడు—

వందనీయమిత్రదీనబంధుబృందనిరత। నందనామందసువచోమరంద మీకు॥

వంది—

పంచచామరము॥ పరాకు సర్వలోకలోకపాలనైకతత్పరా।
పరాకు రంగదంతరంగభాగభాగ్యరాత్పరా।

మాగధుఁడు—

పరాకు నవ్యదివ్యభవ్యభాసురప్రభాకరా।
పరాకు ధైర్యవీర్యశౌర్యపాటవారిభీకరా॥

వారాంగనలు—

ఆ. వె॥ మంగళము సర్వమంగళాపాంగదృక్త । రంగితోత్తుంగపూజ్యరాజ్యాంగ నీకు।
మంగళము రూపదీపితానంగలసద । భంగలావణ్యరంగ నిజాంగ నీకు॥

క॥ జయజయ సుందరరూపా । జయజయ మహనీయ సుగుణజాలకలాపా।
జయజయ రక్షోపరచయ । భయభరహరదతులవిపులబాహాటోపా॥

(అని వీణాగానసహితంబుగ నాట్యము సలుపుచున్నారు.)

(అనంతరము స్వరోచి మంత్రిదిక్కు చూచుచు.)

స్వరోచి—మంత్రివరా! దిక్పాలకపాలితంబులగు సకలదిగ్దేశంబులు సురక్షితంబులా!

మంత్రి—(లేచినిలువంబడి కరంబులు ముకుళించి) మహాప్రభూ! భవత్కరుణాకటాక్ష వీక్షణాభిలక్షితంబులగుట నయ్యవి సురక్షితంబులగుటకు సందియంబెద్ది! అక్షీణసుఖాధ్యక్షంబులైయున్నయవి.

స్వరోచి—దండనాయకా! అస్మత్పాలితంబులగు దశదిగ్భాగంబులు దుష్టరాక్షసప్రముఖ రిపు, చోర, ఖలజన బాధావిరహితంబులై సుఖస్థితిసహితంబులైయున్నయవియా?

దండనాయకుఁడు—వీరవర్యా! భవద్బాహాదండమండితమహోద్దండచండమండలాగ్రఖండితారాతిమండలంబులగు నీదిఙ్మండలంబులు క్షుద్రజనబాధాసహితంబులెట్లగు. నిష్కంటకంబులు నిరంకుశంబులు నిరాతంకంబులునై సుఖస్థితినున్నయవి.

స్వరోచి—కార్యదర్శీ! అస్మత్పరిపాలితసకలదేశవాసులును ధర్మాధర్మన్యాయాన్యాయ యుక్తాయుక్తపరిజ్ఞానపారీణులగు న్యాయాధిపతులచేఁ బరిపాలింపఁబడి సంతుష్టమానసులై సుఖస్థితినున్నవారా!

కార్యదర్శి—ధర్మప్రభూ! మారటసమవర్తవగు నీపాలనంబునకుఁ బాత్రభూతులగు ప్రజల కట్టియసంతుష్టియెట్లు కలుగఁజాలు. సర్వవిధంబుల సంతుష్టమానసులై సుఖంబుననున్నవారు.

(ఇంతలో నొకద్వారపాలకుఁడు లోపల ప్రవేశించి నిటలతటఘటితాంజలిపుటుండై.)

ద్వారపాలకుఁడు—

శా॥ సాహో శేషవిశేషబుద్ధివిభవా సాహో స్వరాడ్వైభవా।
సాహో మానితమానసాంతరసదా సంయోజితార్యాభవా।
సాహో బాహుపరాక్రమక్రమమహాసంగ్రామరంగాహతో।
త్సాహోగ్రారిచమూసమూహవిజయాంచన్నిస్తులప్రాభవా॥

కంచుకి—క॥ జోహారుదివిజచంద్రా । జోహారుమహాప్రతీపశోభాసాంద్రా।

జోహారుదితిజసమరో । త్సాహాహమికాహరత్ప్రిథాని స్తంద్రా॥

ఉ॥ భూరియశోభిశోభితవిభూషణవిస్మ, దయన్, ఛవస్మహా।

పారహిమాచలాగ్రవనపాలకులుగ్రకిరాతకుల్, సభా।

ద్వారమునందుమిమ్ముఁగనువాంఛనుపాయనవస్తురాజివి।

స్తారముగాఁగఁబూని పెనుతండముగాఁబొడసూపిరియ్యెడన్॥

మ॥ కలుకన్ జుంజులు వెండ్రుకల్ బొమిడికల్ గాసెల్ సెలల్ గీరుజే।

గులునామంబులుకోరమీసములుగిల్కున్ గోలలున్ విండ్లుబల్।

కటిమేనుల్ పులితోలుచల్లడములున్ గప్పారువిప్పారుఁజి।

చ్చులకన్నుంగవలున్ గనున్ గొలలుచెంచుల్ వారులేఖాధిపా॥

క॥ వారలుమిముఁగనరాఁగల । వారయియిటవేచియున్న వారలుముదలన్।

గోరితినిటరానిచ్చుట । కారసినాకానతియ్యఁనగుఁగజ్జంబున్॥

మంత్రి—దేవా మిముఁ జూడఁగోరి వనపాలకులు వచ్చి వేచి యున్నవారఁట వారికేమి యాజ్ఞ.

స్వరోచి—మంత్రివరా వారినిటరానిచ్చి వారివృత్తాంతమును విచారింపుము.

మంత్రి—ఓయి కంచుకి ఆచెంచుల నిటరానిమ్ము.

కంచుకి—మహాప్రసాదము (అని వెడలిపోవుచున్నాఁడు.)

[చెంచులు తమనాయకుని ముందిడుకొని లోపలికిఁ బ్రవేశించుచున్నారు.]

చెంచునాయకుఁడు—

గీ॥ దండములునీకుఁబగతురఁజెండుతోఁడ । మొక్కులివెనీకుఁగూళలఁజెక్కుతోఁడ।

యిదిగొజోహారుబీదలకిందునందుఁ । గచ్చులాడఁగూర్చి నెమ్మదినిచ్చుతోఁడ॥

చ॥ పునుఁగుజవాదికస్తురముపుప్పొడికస్తురితేనెగోరజం।

బును నెలవిండ్లుగద్దగఱిముల్కులుముత్తెఁపుఁజాలుచాఱవ।

ప్పునుబులిగోళ్లుదంతములుపూవులుపాములమానికంపుఁబ్రో।

వునుఁగొనివచ్చినారముతవున్ దగఁగైకొననీకునియ్యెడన్॥

గీ॥ సింగములతోళ్లుపులితోళ్లుజింకతోళ్లు। నెలుఁగుఁదోళ్లునుఁగడుఁదొంతరలుగఁదెచ్చి।

నారమోసామిదయదయివారవీని । నెల్లఁజేకొనిమదినుల్లసిల్లవలయు॥

మేమిటకున్ వచ్చినపని విన్నవించెద నాలకింపుము.

మ॥ తడవుగ౯ గాలము వేఁటరాక డవిచెంత౯ జేరకుంతేనియు౯।
దడయ౯ గ్గుట నేనుఁగుల్ పులులతండంబుల్ గడు౯ హెచ్చెను।
క్కుడు సొక్కొక్కియెలుంగులేఁదులు సివంగుల్ పల్లెల౯ జొచ్చెదుం
దుడుకు౯ జేఁతకువచ్చెనక్కలును బందుల్ కానఁ బేరామున౯॥

చ॥ పులులును సింగముల్ గరము పోతరమారఁగ జీవుమాపుఁ బెట౯।
బోలదిను నాసనిండ్లకడఁ బొంచి ప్రజ౯ దినియూళ్లఁ బల్లెల౯।
గల.చుఁగఁ బాడి నర్చె నుడికంబుగ గొల్లెలగొడ్డుగోదల౯।
దలకొని పట్టిచంపితి నెనక్కలుము కుక్కుటమక్కజంబుగ౯॥

క॥ సామివిను మేనుఁగులు పే। రాముఁగ సిమసఁగి కాననాఁగకయూళ్ల౯।
బ్రామిపజ సదమదంబుగఁ। గామిడి క్రొత్తకుక్కడులఁ జంపఁగాఁజాలెఁగడు౯॥

క॥ పిందులుగఁ బొలముల౯ బడి। పండినవరి జొన్న సజ్జపైరుఁ బరువడి౯।
దండిగ మెసవుచుఁ బెనువడి। గొండలగతిఁ దిరుగు నేనుఁగులు క్రొవ్వెలయ౯॥

క॥ కటుకు౯ గోటులనటిముటిఁ। జెటకు౯ గడలుగుల గొరికిచిటచిటలాలయ౯।
జుటముటనములుచుఁ బందులు। గిటికొనుఁ బటుతివియ కష్టగించిన ప్రజల౯॥

గీ॥ తోఁటలెల్లనుఁ గడుఁ జెడు పాటఁ జిక్కె। మల్లుప సచెడిబలువసి వాళ్ల సుక్కె।
చేలు చెలువేదినుర సురసోలిసొక్కె। కాన మెకములయాఁకలి కానవయ్యె॥

క॥ సామిపిను మాటువలుకక। మామనవిమదిఁ దలంచి మానక ప్రజల౯।
బ్రేముడిఁ బ్రోవఁగ వేఁటకుఁ। గామసలక వెడలవలయుఁ గాదనకింక౯॥

స్వరోచి—మంత్రివరా! వన్యమృగంబుల బాధలు మిగుల నతిశయించినట్లు తోఁచుచున్నదే!

మంత్రి—రాజేంద్రా! మృగయావిహారంబున నలిపి తద్బాధనివారించుట రాజులకు ముఖ్యకార్యము. కర్తవ్యమాలోచింపుఁడు.

స్వరోచి—దండనాయకా! నీ యభిప్రాయ మేమి!

దండ—మహాప్రభూ! ఇప్పుడ వేఁటకుఁ గా వెడలుటయ ముఖ్యకార్యంబని నాకుఁ దోఁచుచున్నది.

స్వరోచి—(గురుముఖంబుఁ జూచుచు) మహాత్మా! మృగయా వినోదంబుపైన నపేక్ష పొడముచున్నది. ప్రయాణంబునకు దినశుద్ధి యెట్లు.

గురువు—(మీనమేషాదులు గణించుచు) మఱునాఁడరుణోదయకాలమున వెడలవచ్చును. అది బహుజయలాభసూచకంబును మంగళకరంబునునగు లగ్నముగనున్నది.

స్వరోచి—మహాప్రసాదము ; అట్లనె (మంత్రిదిక్కు చూచుచు) మఱునాఁడరుణోదయంబున మృగయా వినోదార్థముగ వెడలఁ దలఁచితిని. నీవు వీటనుండి దేశపరిపాలనాది కర్తవ్యముల నాచరించుచుండుము. (దండనాయకుని దిక్కు చూచుచు) దండనాయకా ! ప్రయాణంబునకుఁ దగిన సన్నాహసామగ్రిఁ సిద్ధపఱుపుము. కావలయునంత చతురంగ సేనతోడఁ గూడి నీవును వెడలిరమ్ము.

(అని సింహాసనముఁ దిగి మంత్రిదండనాయకాదులతో నా చెంచులున్న యెడకు వచ్చి వారిని వారు తెచ్చియున్న పదార్థములను వింతగాఁ జూచుచు.)

ఓయి చెంచునాయకా ! ఇవి యేమి !

చెంచునాయకుఁడు—

క॥ ఇవిపాపమానికంబులు । ఇవి వెదురులముత్తియంబులివి యేనుఁగులఁ ।
గవిసితలలవిఁ యఁజీలిచి । హావణించినయాణిముత్తియంబులప్రోవుల్ ॥

క॥ ఇదిగో అజమిదికస్తురి । యిదిపునుఁగిది మేల్ జవాదియిదిచందనమి ।
య్యాదిజాంటితే నెమలీయును । నిదిపదనగుచాఱపప్పులివి మూడనగుఁ ॥

క॥ ఇవిపాఱుటంపకోలలు । ఇవి సెలవిండ్లివిసిరాజాలివి మొహదాలి ।
య్యావిచిలుకుటీటెకట్టయు । లివివలలివిజిగురుఁగండెలివి మేల్ తరముల్ ॥

గీ॥ మొరపడంబులుజాగిలములునవంగ । నలరుబలు మేటికుక్కలియ్యవితలంపఁ ।
బులులసింగములను నైనఁబొదివిచేరు । లాడిసిపడనీడ్చియీసుకులనుడుపఁజాలు ॥

గీ॥ సాళువముగిద్దుకురుజా వేసడముకడుజా । బాఁచు సెలక డేగజాలియు భైరియుణుజా ।
లనుకులంబుల డేగలియ్యవిపులుంగు । గములమున్నాడి వెన్నాడి సమయఁజేయు ॥

స్వరోచి—ఓయినాయకా ! ఈ చెంచుబాలురు మృగయావినోదంబున కాయత్తులై వచ్చియున్నవారా ! క్రూరంబులును మహాఘోరంబులును నగునరణ్యమృగంబులతో నిర్జయులై పోరుసామర్థ్యము వీరికిఁ గలదా.

చెంచునాయకుఁడు—సామీ ! వీరలాపనులకుఁ వలంతులు. సందియములేదు. (అని యాబాలుర నొకనొకనిఁగాఁ జేపట్టి చూపుచు)

గీ॥ ఆముటేనుఁగు తలఁజీల్చినడరుబొబ్బ । మెకముఁబవనీడ్చితీఁగెవాగెకుఁగుదిర్చి ।
యదవివయ్యాళిఁదోలునీబుడుతవాఁడు । వేఁటలకుజాలునని వేఱెచాటవలెనె ॥

గీ॥ పొంచిపొంచికుప్పలించుఁబెబ్బులికదు । రెగిరిక్రిందుమీఁదులాగినొనర్చి ।
పోరిపోరిమరిశఁబొడిచియొయ్యనఁజంపుఁ । జెక్కుచెదరకల్లచిఱుతవాఁడు ॥

గీ॥ సిల్లుచూపికినుకఁజిఱిచిఱిలాడునే । మంగుతొండమొడిసి చెంగిదాని।
కొమ్ములూనితోనకొనతలకెగఁబాతి । యాడుఁబాడుఁగుఱ్ఱవాఁడువీఁడు॥
గీ॥ ఎదిరియొదుగునూకు నేకలంబును దాఁకి । గోఱలాడిచి నేలఁగూలఁద్రోచి।
క్రిందుమీఁదొనర్చి క్రమ్మందఁజింగులు ద్రొక్కు । చుండునీవలంతిదుండగీఁడు॥

స్వరోచి—అంతటి సమర్థులావీరు; మాతముగాక.

(మంత్రిదిక్కుచూచుచు) ఈ చెంచులను ఇంచుకంతయుఁ గొఱంతలేకుండునట్లు తత్తదుచిత భోజనపానాదులఁ దృప్తినొందించుటకుఁ దగినవారిని నియమించి మఱునాఁడు ఉపకడ మనసైన్యంబుల వెంబడి వేఁటకుఁ బనుపుము.

ఇప్పుడు మధ్యాహ్నము కావచ్చినది. ఒడ్డోలగంబుఁ జాలింతము.

అందఱు నిష్క్రమించుచున్నారు.

ఇది చతుర్థాంకము—ప్రథమరంగము.

## చతుర్థాంకము—ద్వితీయరంగము.

[హిమాచలప్రాంతమందలి యరణ్యము.]

(స్వరోచి సకలపరివారసమేతంబుగ వేఁటకుఁగాను ప్రవేశించుచున్నాఁడు.)

స్వరోచి—దండనాయకా! ఇది మిగుల ఘోరారణ్యముగ నున్నది. ఇందు మన పరివారజనంబు లుండుటకుఁ దగినట్టియు, భోజనస్నానపానాదుల కనుకూలము లగునట్టియు, శీతలచ్ఛాయాసహితములగు నికుంజపుంజముల నరయుంబంపుము. మృగయావిహారమున నలసి సొలసిన వారు విశ్రమించుటకుఁ దగినలతాగృహంబులఁ జూచి చక్కఁజేయింపుము. చెంచునాయకునితో నాలోచించి మృగంబులఁ జోపను, జలాశయంబులయొద్దఁ గావలియుండను దగినవారి నియమింపుము. ఈ దుర్గమారణ్యంబులు రథప్రచారంబున కనుకూలము లగునవి కావు. వానినొక్కచో నిలిపి గజ తురగ పదాతిబలంబుల నచ్చటచ్చట నిలువ నియమింపుము. ఈ సదుపాయములన్నియు నీవెఱింగినవే. విస్తరించి చెప్పవలసియుండదు.

దండనాయకుఁడు—చిత్తము. ఆజ్ఞానుసారము జరుపువాఁడ.

(అంతట అందఱును స్వేచ్ఛగా మృగయావిహారము చేయుచున్నారు.)

ద్విపద.

1. కంఠీరవముభయంకరగతినడరె - కంఠంబుమండలాగ్రమునఖండింతు
2. వ్యాఘ్రంబుఘుర్ఘురధ్వనిసల్పెనదిగొ - శీఘ్రంబవానిహింసింతునస్త్రమున

3. కుంజరంబతిమదాకుంభత నెదిరె - భంజింతుఁ దుండంబుఁ బడఁగూల్చి దాని
4. ఖడ్గంబు జనముఁ గ్రక్కదలమార్కొనియె - ఖడ్గధారాహతిఁ గావరమడఁతు
5. భల్లూకమదరి పైఁబడి వచ్చెఁ జూడు - భల్లమొక్కటదానిఁ బడఁగూల్తు నిపుడె
6. సైరిభంబెదిరె నా సైంధవప్రతతి - సైరింతు నేయీ పెసమయింతుఁ గాక
7. సూకరంబతిభయసూచకంబయ్యె - భీకరాశుగధారఁ బీరమడంతు
8. శల్యము ఱువ్వ దెవిచ్చై శలలీవ్రజంబు - శల్యంబున దానిసారెఁ బీడింతు
9. వృకసృగాలతరక్షువృతమీయరణ్య - మొకట నెల్లరఁ జుట్టియొత్తి రావలయు
10. హరిణముల్బెదరి చయ్యనఁ బారఁజొచ్చె - పరిగొనవలలొడ్డి పడనూకవలయు
11. పారావతాదికపక్షిజాలముల - భైరిమున్నగుడేగపదుపులఁ జంపు.

స్వారోచి—(చెవియొగ్గి యాలకించి) ఆహా! ఇదియేమి. ఒకానొకయార్తనాదము వినవచ్చుచున్నది. మనవెంబడి స్త్రీలెవ్వరును వచ్చియుండలేదుకదా. ఈ స్త్రీల యార్తనాదమునకుం గారణంబేమి.

(ఇంతలో మనోరమ శోకవ్యాకులచిత్తయై రోదనమొనర్చుచు అలసి సొలసి పరుగిడుచు వచ్చి స్వారోచియెదుట నిలువంబడి చేతులు మొగిడ్చి వడవడవడంకుచు)

చ॥ శరణము భావనాదరణ, సజ్జనదీనదశావిదారణా।
శరణు నరామరాభిహితసర్వసమగ్రసుఖాదికారణా।
శరణు పరాక్రమక్రమవిశాలనిశాగ్రభుజాగ్రలోలభీ
కరఖరమండలాగ్రపరిఖండితశాత్రవయుగ్మహారణా॥

క॥ రక్షింపుము రక్షింపుము । రక్షింపుము రూక్షవీక్షరక్షోవరబా।
ధాక్షుభితహృదయను నను సహ । సాక్షీణమహాకృపాకటాక్షస్ఫురణన్॥

క॥ అన్నా శురుఁడ గురక్కసి । మిన్నయొకండదరిచలము మెయినియ్యెడవిన్।
రెన్నాళ్లనుండి పాయక । వెన్నాడుచునున్నవాఁడు వెఱపుగదురఁగన్॥

క॥ బాలను గళవికనొందిన । గోలను గ్రూరాసురాతిఘోరభయవ్యా।
లోలను, బేలను, దాశం । జాలను బాలింపుమింక శరణంటి నినున్॥

స్వారోచి—ఓ బాలికామణీ! నీవెవ్వతెవు! నీ పేరెయ్యది. భయభ్రాంతవై నీవీమహారణ్యంబునన్ దిరుగఁ గారణంబేమి!

మనోరమ—క॥ ఇందీవరాక్షుఁడను పే । రం దగి గంధర్వరాజ్యరమశోభిలి[illegible]।
నందమునవలయు ఖేచరు । నందనను మనోరమాఖ్యనలువగుదానన్॥

క॥ హరిదశ్వపుత్రి యగునను । చిరనాకుంజనని వినుము చెన్నతిజనకుం।
దరయ నొకానొకధరణీ । సురుశాపము దాకి రాక్షసుండయి చనినన్॥

క॥ మాతులుఁడు చిత్రసేనుఁడు । మాతను వనుఁ బ్రోచు బ్రేమ మల్లడిగొనని।
ర్భీతి మెయి సఖులతో వన । జాతంబుల సంచరించు సమయమునందున్॥

క॥ తలయును గడ్డంబును మీ । సలు మేనును నెఱయ నెఱసి సముదితతూలా।
మలరాశిఁ బోలికముని । శ్చలగతిఁ దపము చరించు సంయమినొకనిన్॥

క॥ కని యతని యవయవంబులు । గన నేరని వింతనింతగ దిసి నిజకరం।
బున మీసలాడిసితి విసినఁ । గనులల్లన విచ్చి కోపకలితుండగుచున్॥

క॥ ఓసి, వినుమిహపరంబులు । గోపిహ రాత్ప్రదంబగు నాని రూషమనోవి।
ధ్యానము గను, నను, నీగతి, । దాసి, రహిన్ జెనకి నిటు గడంగుటతగునే॥

క॥ భోగినివగుటను, సురతా । భోగసుభోగాభియోగ భూషిత కామో।
ద్యోగభుజంగాంగంబను । రాగంబున నంటవగుఁ బరామరిక మెయిన్॥

శా॥ లభ్యాంభఃకణవాయుపర్ణఫలమూలప్రాశనప్రాప్తిని।
త్యాభ్యేకాగ్రవినిశ్చలామలమనోవ్యాపార మేపారఁ యో।
గాభ్యాసాతిశయంబుఁ బూనుమమ్ముఁ సంక్రాంతాంతరాత్మ్యాంతవా।
ల్లభ్యప్రాభవగర్వఘూర్ణహాత్రగాలన్ రేఁచిపోవచ్చునే॥

క॥ అక్షుభితుఁడకుచు కెనుకొను । రక్షోవపు బొతిఁ బొరిరిందుమునఁ బాణా।
పేక్షఁ జనియొక్కరేఖా । ధ్యక్షుని శరణమ్ము సనభయదానావనముల్॥

క॥ కాంచెదవు సుమ్ము నాపలు । కించుకమునని వృకోళ్ప్వయికనైనమున।
శ్చాంచల్యము డిగి సన్మా । ర్గాంచితమగువృత్తి నుండు మనిశపియించెన్॥

(అనిపలుకుచు భయభ్రాంతయై చెవియొగ్గి యాలకించి)

సీ॥ కఱకుఱుంజాఱువెండ్రుకలవాఁడు పసఁడోడిను గిఱ్ఱపేఘతిలపాగవలగు వాఁడు।
గుండ్రనికను గ్రుడ్లగులకరింపుల వాఁడు మినుకుఁగందన చాయ మేని వాఁడు।
బలుపాము నెగు భుజంబుల వాఁడు బహుతుండ మాలికల్ గళమునఁ గాలు వాఁడు।
కట్టెత్తవగు వాల్కగలవాఁడు గోకిబికిసంతముల్ దంష్ట్రికల్ దనరు వాఁడు।
గీ॥ కుంభసన్నిభ మగులంబకుక్షివాఁడు । బిట్టుమిట్టాడు గదఁ గేలఁ బట్టువాఁడు।
జగము దిగ్రమింగువంగ దనెగడు వాఁడు। వాఁడె చను దెంచె వనుఁ బ్రోవ వలయు నేఁడు॥

(అని స్వరోచి వెనుకకుఁ బరువెత్తుచున్నది.)

స్వరోచి—బాలామణీ ! భయపడకుము. నీకభయంబిచ్చువాఁడను.

దండనాయకా! నే నీరాక్షసుని జయించివచ్చువఱకు నీమె నొకకుంజాంతరంబున నునిచి రక్షించుచుండుము. (అనిరాక్షసున కభిముఖుంబుగా నిలుచుచున్నాఁడు.)

రాక్షసుఁడు—

ఉ॥ ఓరినరాధమ, మహోగ్రతరక్షుఁడ, నాదుబారికిన్।
జేరినయొక్కదిక్కరిన చేడియఁ ద్రిమ్మఁగఁ దలంచిరా, ముదం।
బార, ననేక సైన్యనిచయంబులతో నిటనీవు దోఁచితో।
రౌర, మదీయపుణ్యవిభవాతిశయంబప దేతలంచినన్॥

క॥ క్రమ్మంగెడనిను నీబలమును, । బొంగెడసంగడతోలంగఁ, బోరినుత్తుంగా।
భంగాంతరంగమలరనె । సంగెడ, వినుమిపుడకసిమసంగెదననికిన్॥

క॥ ఓరివినుమాలమునుమదిఁ । గోరకుమిక వంటయింటికుందేలవునా।
బారిఁబడి బ్రదికికడచను । వారుగలరె చాలుఁ ద్రిమ్మఁగవలెరమ్మిఁకన్॥

స్వరోచి—

ఉ॥ ఓరిదురాత్మ, యేలనిటులూరక ప్రేలెదు, చాలు, భూరిదు।
ర్వారపరాక్రమక్రమమువారణఁ బూనినవాఁడ వేనిర।
మ్మారణభూమినిల్చి వెరవారఁగఁ జూపుదు, గాకయున్న నా।
ఘోరమహాస్త్రధారననిఁ గూల్చి జగంబులయార్తిఁ బాపెదన్॥

క॥ కాలము సమకూరిననీ । బాలామణిఁ గాంచి వెంటఁబడివచ్చితివీ।
కీలలికిఁ బోలవెదురన్ । జాలినఁ గూలింతు నస్త్రశస్త్రాహతులన్॥

రాక్షసుఁడు—

క॥ ఏలరె మూఁడుకుఁదనంబిది । చాలురథపదీయసాహసక్రియలిచటన్।
బోలవుర చేలవురి కడు । గోలవురి, రణంబొనర్పఁ గోరకురమదిన్॥

క॥ పటపటలాడుచు గవడిను । కటకటగతిఁ దలలవియఁ గొట్టికి, కడు మోదముహ్పొ।
త్పుటమున వెలయఁగ, మేదః । పటలిన్ జవులూరఁ ద్రిమ్మంగు భాగ్యముఁ గంటిన్॥

క॥ మెడలాడిసివడిఁ గఱుక్కన । బుడమిన్ బడనతికి వెలికి బుడబుడలాలయన్।
వెడలునలరక్తపూరము । బడిబడిఁ జవులూరఁ గ్రోలుభాగ్యముఁ గంటిన్॥

క॥ వానిరిజతగావలిపాలి । ప్రూవఁగఁ దిగఁ జీల్చి ప్రేవుపోవులు వరుసన్।
సేవలగతి వానుదిసం । భావించుచుఁ ద్రిమ్మంగి పొందుభాగ్యముఁ గంటిన్॥

క॥ ఒకకేల మొండెమును, మఱి । యొకకేలన స్రుక్కుపాల మొగిఁ గ్రాల, మహో।
త్సుకతన్, గొఱుకుచుఁ ద్రాగుచుఁ । బకపక నగి చిందులాడు భాగ్యముఁ గంటిన్॥

క॥ తనివోవమాంసపుంజముఁ । దినితిని శేషించుశవము లిట్టులుకడునిం।
పునఁగఱకుట్లుగ మొలనిడి । పనిపడిభక్షించి మించు భాగ్యముఁగంటిన్॥

క॥ వచ్చితిఁ జిచ్చుఱపిడుగవు । జొచ్చితినీబలము, లిదిగొ సారిదియుదరముల్।
వ్రచ్చితి; నినుజయించితిఁ । బుచ్చితి; నిఁకరణము సేయఁబూనుముకడఁకన్॥

(స్వరోచియు--రాక్షసుండును ద్వంద్వయుద్ధంబు సలుపుచున్నారు.)

స్వరోచి—ఓరి రాక్షసాధమా! ఈ యాగ్నేయాస్త్రమాహాత్మ్యంబున్ జూడుము.

రాక్షసుఁడు—ఆహా! మాచెద. (అని తినగదాహతిన్ దానిఁ జక్కాడుచున్నాఁడు.)

స్వరోచి—ఈ ఐంద్రాస్త్రమున్ జూడుము.

రాక్షసుఁడు—అబ్బా! ఇదేనా నీయైంద్రాస్త్రము.

(అని తనగదతో దాని వారించుచున్నాఁడు.)

స్వరోచి—ఇదిగో ఈ వారుణాస్త్రమున్ జూడుము.

రాక్షసుఁడు—అబ్బబ్బా! రానిమ్ము చూచెదె.

(అని దానిని సయితము వారించుచున్నాఁడు.)

స్వరోచి—ఒరీ! నీచరాక్షసా! సామాన్యములగు నస్త్రములను నీగదాహతిన్ జక్కాడినట్లుకాదు. బ్రహ్మాస్త్రమున్ బ్రయోగించెద నీ ప్రాణంబులన్ దప్పించుకొనుము.

(అని ప్రయోగించుచున్నాఁడు.)

(అంతట నారాక్షసుఁడు తనవికారరూపమునువీడి దివ్యతేజఃపుంజరంజితంబగు మంజులరూపంబున స్వరోచియెదుట నిలువంబడి కరంబులు ముకుళించి.)

ఉ॥ శ్రీకర, లోకపాలకవశీకర, భూరియశోవిశాలశో।
భాకర; విశ్వకంటకమహాసురఘోరతరావలచ్ఛమూ।
భీకర; పార్వతీలసదభిన్నకృపాపరిపాలితవ్రజా।
స్తోకవరూధినీహృదభిశోభితతోయనిధిక్షపాకరా॥

ఉ॥ పుణ్యవిచారనిత్యపరిపూర్ణనమోనమో; ధీరసంస్తుతా।
గణ్యపరాక్రమక్రమవికాసనమోనమో; లోకమాన్యపా।
ద్గుణ్యవిరాజితార్యభయదూరనమోనమో; నవ్యదివ్యలా।
వణ్యవిలాసవైభవనివాసనమోనమో; చిత్తగింపుమా॥

దండకము.

శ్రీమన్మహాబంధురాఖర్వగంధర్వసామ్రాజ్యరాజ్యాధిపపూజ్యాండ నిందీవరాక్షాఖ్యుఁడన్ మన్మహాభోగభోగాభియోగంబువర్ణింపఁగానేల సద్యస్సముత్పన్నతాపత్తిన్ గరంబొప్ప

నీసత్సితచ్ఛత్రసంఘాత మీచామరవ్రాత మీగాయనీజాత మీవందిసందోహ మీమాగధస్తోమ మీదాసదాసీజనానేక మీభూరిరత్నద్యుతిస్ఫారకోటీరహారాంగుళీయాంగదాంచత్పరిష్కారవిస్తారదేదీప్యమానప్రభారాజియున్ దెల్పు నేవంవిధానేకసౌఖ్యాస్పదంబాపదంబొందియున్ స్వాపరాధార్జితంబైన శాపప్రభావంబుఘోరాసురాకారమున్ బూన్పవిజ్ఞానహీనుండనై క్రూరభావుండనై బంధుబృందంబులన్ బౌరసందోహమున్ సైన్యసంఘాతమున్ మ్రింగి దేశాంతరంబుల్ ప్రవేశించి యందున్న రాజేంద్రులన్ దివ్యమౌనీంద్రులన్ సారెకుంబట్టిగిట్టించి నాపొట్టకున్ బెట్టుగాఁబెట్టుచున్ వృద్ధబాలాంగనాభేదమింతైన రక్షింపకక్షీణరూక్షక్షుధాబాధకున్ దార్చి యాపల్లియల్ గ్రామముల్ పట్టణంబుల్ వినాశంబునొందన్ మహోగ్రాటవుల్ జొచ్చి కంఠీరవవ్యాఘ్రశుండాలభల్లూకకోకాదికానేకనానామృగానేకమాంసంబులస్తోకమాకాంక్ష నెంతేని భక్షించి భక్షించి యీకాయమున్ సారెరక్షించిరక్షించి కుక్షింభరిత్వంబునన్ గ్రాలఁగాఁగంటి నాతారకల్ వర్షధారల్ దగన్ లెక్కకున్ జిక్కినన్ జిక్కఁగాకేమి యీకుక్షినక్షీణరూక్షత్వమున్ బూను నాజాఠరాగ్నిచ్చటన్ గ్రాఁగుచున్ మాయమై చన్నయాజంతుసంతానమింతింతయంచున్ గణింపంగసాధ్యంబుగాకుండు నే నీసరోజాక్షి నాకూఁతురంచున్ మదిన్ దోఁచ కీలాగు మున్నాడి వెన్నాడుచున్ బట్టిభక్షించుకాంక్షన్ వడిన్ వచ్చి యుష్మన్మహాదర్శనప్రాప్తి శాపావధిన్ గంటి పూర్వస్థితిన్ మంటి నీమానితాత్యాయతాంచత్ప్రభావంబు భావంబునన్ గాంచి వర్ణింపఁగా నేర నన్నున్ గృపాపాంగదృష్టిన్ విలోకించి నీవానిఁగా నెంచి నెయ్యంబుఁ గాన్పించి మన్నించుమో స్నేహసంభావితేంద్రా మహావీరచంద్రా కృపాపూరసాంద్రా నమస్తే నమస్తే నమః.

మనోరమ—(తండ్రికి నమస్కరించుచు.)

క॥ తండ్రీ మ్రొక్కెదనిదె కడు । వేంద్రంబగుశాపభరము వీడెఁ దొసంగున్ ।
దీంద్రములువాసె, నికఁదలి । చంద్రులఁగని యలరుసూనృతము నేఁగంటిన్॥

ఇందీవరాక్షుఁడు—(మనోరమను జేరఁదీసి ముద్దిడి శిరంబు మూర్కొనుచు.)

ఉ॥ అమ్మరొ నీవు నాతనయవంచు నెఱుంగని గాఢమూఢతా ।
వమ్మునవీనగాగ్రవనవాటమునన్ నినుగాంచిపట్టఁగా ।
నమ్మెనరింపఁబూనిననిశాచరభావుని నన్ను రోయకీ ।
విమ్మెయి చేరి మ్రొక్కుటకు నెంతయుహర్షముగాంచితిన్ మదిన్॥

స్వారోచి—మహాత్మా! నమస్కారము.

ఇందీవరాక్షుఁడు—పెండ్లికొడుకవు కమ్ము.

స్వరోచి—తమశాపవృత్తాంతము వినుటవలన దుర్భరంబగు దుఃఖంబుఁ గంటి నైనను తన్ని
వారణంబునకు నేన కారణభూతుండనగుటన్ దలంచిన నిర్భరంబగు సంతోషాతి
శయంబు బొడముచున్నయది. మీకట్టి మహాఘోరంబగు శాపంబుగలుగుటకున్ గార
ణంబు విన వేడుకయ్యెడుఁ గరుణించి యానతీయవలయునని ప్రార్థించెద.

ఇందీవరాక్షుఁడు—ఆ శాపము యౌవన గర్వంబున నే నూరక సంపాదించికొన్నది కాని
వేఱు కాదు. అవ్విధంబు వాక్రుచ్చెద నాలకింపుము.

శా॥ సర్వజ్ఞుండగు బ్రహ్మమిత్రుఁడు నిజచ్ఛాత్రప్రపంచంబునా।
యుర్వేదంబుఁ బఠింపఁ జేయఁగని తద్వ్యక్తస్పృహన్ మానిరా।
ట్కుర్వన్ జేరి నమస్కరించి నను శిష్యప్రాయుగా నెంచియా।
యుర్వేదంబు ననుగ్రహింపుమనరోషోగ్రోజ్జ్వలన్మూర్తియై॥

శా॥ ఓరీ దేవకులాధమా, విటులు లేరో; వెంటరారో; నటీ।
స్ఫారోదారవిలాసహాభినయలాస్యప్రక్రియల్ జూడ నిం।
పైరాజిల్లవు; గాయనీమధురవీణానూనగానామృతా।
పారంబుల్ విననింపుగావో; పరిహాసంబిట్లు గావింపఁగన్॥

క॥ నీవా సేవారతిప । ద్భావాతిశయంబుఁ జూపుధవ్యుఁడవు భళీ।
వేవిధములని మశిష్యుని । గావరియింతు నెయి వేటి గర్వోల్బణముల్॥

క॥ ఈ కుసుమము, లీగంధము, । లీకనకాంబరవిభూష, లీతాంబూలా।
స్తోకామోదవినోదము । లా, కనుఁగొన శిష్యలక్షణానేకంబుల్॥

క॥ ప్రాకటవేదాధ్యయనము । నీకలవియె; వారకామినీమధురతరా।
స్తోకవచోమధుపానప । మూకులితాత్మకుఁడవగుట నారయ నెందున్॥

క॥ నిను శిష్యునిగా నిటఁ గై । కొని యధ్యయనార్హ శిష్యకోటిఁ జెఱుచుకం।
బెను చెడుఁ గెయ్యది చయ్యనఁ । బని విను మిఁకఁ జాలు మాఱువలుకకుమనినన్॥

క॥ శాపభయంబున వాతని । కోపంబున కోర్చి హృదయగోపాయితసం।
తాపమునఁ దొలఁగి కుటిల । వ్యాపారము నూది కైతవాతిశయమునన్॥

క॥ శిష్యానురూపముననా । శిష్యాళిఁ గలసి యధివసించుచుఁ దగనా।
ఋష్యుక్తవేదమున ద । ద్భాష్యము ననుగ్రహించియంతఁ బాయనికడిమిన్॥

చ॥ మునివరుఁ జేరి వవ్వుచు "నమోనమో" యంచు నమస్కరించి నే।
వినయము భక్తియున్ వెలయ వేఁడి వవిద్య ననుగ్రహింపకే।

పునవసుధిః కృరించితిరి; పూనికశిష్యుని వేషమూనివం।
చన మెయివిద్యఁ జేకొని ప్రసంగమునన్ మిముఁ గెల్వవచ్చితిన్॥

క॥ రండికజాగేటికి నా । పాండిత్యముఁ జూపువాఁడ బహువిధ మేధా।
ఖండచమత్కారసదా । మండితమహితప్రసంగమానితఫణితిన్॥

క॥ అనిబహుగర్వాధిక్యం । బున నేమియుఁ దోఁచకిట్లు పాడిచి పలికినన్।
విని ప్రళయభైరవాకృతిఁ । గనలుచుఁ గటతటములదరఁగా నిట్లనియెన్॥

క॥ వంచన మెయినిటు విద్యగ్ర । హించియు వినయము ననను నయించక గర్వో।
దంచితమతి మేలముఁగా । వించుటఁ దత్ఫలము ననుభవింపుము సరగన్॥

క॥ శిష్టాచారవిదూరత । నష్టహితాహితవివేచనాజ్ఞానము వి।
స్పష్టముగఁ జూపు సుపథ । భ్రష్టుఁడవీవగుట నింక బహుకాలమిలన్॥

క॥ ఘోరాసురరూపము దు । ర్వారగతిన్ బూని ప్రాణివర్గజిఘాంసా।
పారవిహారవిచారవి । కారక్రూరుండవయి పొకాలము సరగన్॥

వ॥ అని శాపంబిచ్చుటయుఁ గను దెఱచి భయభ్రాంతుండనై గడగడవడఁకుచు నమ్ముని వరు పాదంబులన్ బడి యేడ్చుచు వెచ్చనూర్చుచు మహాత్మా! నా యజ్ఞానంబు సైచి నన్నుం గరుణించి శాపంబుఁ గ్రమ్మరించి రక్షించి మన్నింపవేయని నానా విధంబులన్ బ్రార్థించి లేవకున్న నమ్మహామహుండు కరుణారసార్ద్రహృదయుండై ననున్ లేవనెత్తి వత్స! నీయనుజ్ఞానంబు సైచితి నీపశ్చాత్తాపంబునకు మెచ్చితి నినున్ గరుణించితి నైన నాశాపంబమోఘంబు గావున రాక్షసుండవైయుండి కొంత కాలంబునకు నీకూఁతురెన్ గ్రమింగఁబోయి యాయమశరణుఁజొచ్చిన యొకానొక మహాపురుషునితో యుద్ధంబొనర్చి యాతని బ్రహ్మాస్త్రప్రయోగంబున నీరాక్షసాకారంబు దగ్ధంబై చన నిజరూపంబువహించి సుఖించెదవు చనుము అని వచియించి యంతర్హితుండై చనియె. నేనును శోకవ్యాకులితచిత్తుండనై మత్పురాభిముఖుండనై పోవుచు మార్గంబున.

మ॥ అసకృద్భూరితరాట్టహాసమ్ము; ముహుర్హుంకారహుంకారసా।
ధ్వసబాధాపరికంపితాఖిలజగద్వ్రాతంబు; శశ్వన్మహా।
చ్ఛ్వసితోద్యద్రయసంవిధూతజలముక్సంఘంబు; హింసామనా।
గ్వ్యసనావిష్కృతఘోరకృత్యప్రచలితాశానీక మైయొంతయున్॥

శా॥ సాధీయోవివృతాస్యగహ్వరము;దంష్ట్రాశిఖీ ష్మద్రుమభ్రంశహా।
శ్వేధంబుచ్ఛ్రితఘోణమగ్నికణసందీప్తాక్షియుగ్మంబున।
క్రోధఘూర్ణితటీచాలనంబతిబృహత్కుక్షిప్రవృద్ధక్షుధా।
బాధాధీనము నై వికారమగురూపంబయ్యెడంగాంచితిన్॥

శా॥ క్షోణీమండలమెల్లఖండములుగాఁ గ్రుద్ధన్; సముద్రంబుల।
క్షీణోద్యజ్జలౌఘవంబొలయ లంఘింపన్; గులక్ష్మాధర।
శ్రేణిన్ గందుకపాళినాఁగఁడఁగుచున్ జేపట్ట; సాధ్యంబులో।
ప్రాణుల్ మేనజనించెనేమనమహాత్మా కాపమాహాత్మ్యమున్॥

క॥ నీకరుణశాపమోచన । మీకరణిన్ గంటిమంటినిఁక నామనవిన్।
గైకొనియీకమలాననఁ । జేకొనినను దగఁగృతార్థుఁ జేయఁగవలయున్॥

క॥ కడవాఁడఁగాను జూడకు । కడకన్నుల, నీకుతల్లికడవాఁడను, నా।
కడగండ్లఁబాపితివిరయే । కడలన్ నీవాఁడనగుచుఁ గ్రాలుదు చెలిమిన్॥

వ॥ వేనిప్పుడకదలి నాజననీజనకులను భార్యను జూచి వారలనంతసింపన్ జేసి వివాహముహూర్తంబు నిశ్చయించి మిమ్మున్ రాఁబనుచువాఁడ నీవును వీటికిన్ జని వరూధిని కీవృత్తాంతంబంతయున్ దెలిపి యామె సమ్మతిపడసి సకలసన్నాహ సమేతుండవై యుండుము. శుభంబయ్యెడు పోయివచ్చెద.

(అని సకలపరివారసమేతంబుగ వెడలిపోవుచున్నాఁడు. అంతట స్వరోచియు తన సేనా సహితుండై నిజపురంబునకు వెడలుచున్నాఁడు.)

(ఇది చతుర్థాంకము—ద్వితీయరంగము.)

---

శ్రీరస్తు.

# స్వారోచిషము.

---

## పంచమాంకము—ప్రథమరంగము.

(స్వారోచిమందిరము.)

[వరూధిని రంభ మేనక ప్రవేశించుచున్నారు]

వరూధిని—చెలియలారా! మన స్వారోచి వెంబడి వేటపోయియుండి ముందుగావచ్చిన పరిజనులు అచట జరిగినవృత్తాంతములనెల్ల విశదంబుగ వర్ణించి వక్కాణింప వింటిమి. శ్రీ కాత్యాయనీమహాదేవి వరమహాత్మ్యం బమోఘంబగుట మన స్వారోచికి సర్వవిధముల శుభోదయంబగుఁ గాని వేఱు గాదు.

రంభ—వరూధినీ! నీ పురాకృతము మంచిది. నీపుణ్య మగణ్యము. నీవు వారాంగనావృత్తికిఁ జొరకయున్న స్వారోచిఁ గనుట. ఆ హేయమగువృత్తిమాని పరమ గౌరవంబున కాస్పదంబవై యీలోకమాన్యుం డగుకుమారునిం బడసి యానందించు భాగ్యంబుఁ గంటివి. ఇందునకనుగుణంబుగ ననురూపయగు కోడలిం గని పౌత్రులఁ జూచు మహాయోగము తటస్థించినని, నీభాగ్యము మిగుల శ్లాఘనీయము.

మేనక—(రంభదిక్కుఁ జూచుచు) ఓచెలి! మనము నిర్భాగ్యులము; మనకిట్టి మహాపదవి లభించినదికాదు.

వరూధిని—(చెవియొగ్గి యాలకించుచు) ఏమో శబ్దము వినవచ్చుచున్నది. స్వారోచివచ్చుచున్నాఁడు కాఁబోలు.

రంభ—ఉండవచ్చును. వచ్చుసమయమె.

మేనక—చెలియలారా! స్వారోచిమృగయావిహారకాలమున జరిగిన మనోరమాప్రాణ రక్షణంబును ఇందీవరాక్షశాపవిమోచనంబును మున్నగు వృత్తాంతములన్నియు మనకుఁ దెలిసియున్నయవి. ఆ మనోరమనుగూర్చి మన స్వారోచికిఁ గలిగియుండు హృద యాభిప్రాయ మొకటిమాత్రము తెలియవలసియున్నది. అతఁ డిటకు వచ్చినప్పుడు

మీరూరకుండుఁడు. నేను సందర్భానుసారముగ నతని నడుగుచు తన్మనోభావమును వెలివుచ్చెద.

వరూధిని—మేనకా! నీకు చేష్టలెపుడు మానమున్నదానవా నేనెఱుంగ.

రంభ—అవును వరూధినీ! నీవు స్వరోచినడిగిన తల్లివగు నీయెదుట సహజసంకోచభావంబున నిజమనోభిప్రాయమును దేటపఱుపండని తోఁచెడి మన మూరకుండుదము.

మేనక—అదుగో స్వరోచి వచ్చిన ట్లున్నది.

స్వరోచి—(సాదరభావుండై లోపలికివచ్చి) తల్లీ! నమస్కారము సుఖంబున వచ్చితి.

వరూధిని—తనయా! శీఘ్రంబునఁ బెండ్లికొడుకవు కమ్ము.

రంభ—మేనక—తథాస్తు.

స్వరోచి—(తలయెత్తిచూచి) ఆహా! మీరు ఇచ్చటనేయున్నారా! (అని వారిరువురికి నమస్కరించుచున్నాఁడు.)

(అందఱు కూర్చొనుచున్నారు.)

మేనక—ఓయి స్వరోచి నీ మృగయావిహారకాలమున జరిగిన వృత్తాంతములను చారుల చేత ననేకవిధంబులుగ వక్కాణించుచున్నారు. మే మవియన్నియు నీ ముఖంబున వినవలఁతుము వక్కాణింపుము.

స్వరోచి—నే నారీతి సకలపరిజనసమేతుండనై వేఁటకుఁ జని సంతత నిరంతర దురంతానంత నికుంజపుంజ సమాక్రాంతంబును, సింహ శార్దూల ఖడ్గ గవయ వరాహ భల్లూకాది నానాక్రూరమృగ సమాకులంబును, దుర్గమంబును, నిర్గమనదుష్కరంబును, నిర్జలంబును, నిర్జనంబును నగు నొక మహారణ్యంబుఁ జొచ్చి పరిజనులు యథేచ్ఛ నెడనెడ మృగయావినోదంబులు సలుపుచుండ నేను అంగరక్షక దండనాథసమేతంబుగ,

శా॥ ఆజానేయము నెక్కి సింహశరభవ్యాఘ్రాచ్ఛభల్లాదినా
నాజంతుప్రకరంబునుగ్రశరసంధానాదిక్రీడిఁ
గ్రాజిఁ గూల్చుచు నేగుచో నొకటరారాజద్విలాసంబుచే
తోజాస్త్రభ్రమఁగొల్పుఁదజ్జవరవాస్త్రోపమూర్తధ్వనిఁ॥

క॥ రక్షింపుమురక్షింపుము। రక్షింపుముయాత్మవీక్షరక్షోవరబా
ధాతుభీతనుమ నొకయు। జ్జాక్షివనుఁ శరణుఁజొచ్చె నాసముయమునఁ॥

మేనక—స్వరోచి ఆయుజ్జాక్షివయస్సు ఎన్ని సంవత్సరము లుండవచ్చును.

స్వరోచి—అష్టాదశవత్సరంబులని తోఁచెడి.

మేనక — ఆ బాలికామణి నిన్ను శరణుఁ జొరకమున్ను దుర్భరభయశోకవ్యాకులచిత్తయై దూరమున సంచరించునపుడు మీర లేమని తలంచితిరి.

క॥ ఎడనెడనీరమ్ములుఁబడి । బడిదూఱుచు, వెడలికడలఁబరువిడుచుఁ, గడుఁన్ ।
జడియుచు, నడుగడుగునకున్ । బడలుచుఁ, దడఁబడుచుఁ, బడుచుఁ, బడతుకదియగన్ ॥

సీ॥ ఊహింపనాకారమూనిమానుగఁగాన వెలయుసమ్మోహనవిద్యయనుచు ।
పరికింపనపుడభూభాగయోగము గాంచిలలినొప్పుచంచలాలతికయనుచు ।
భావింపజంగమభావమావహిలంగ వఱలుకాంచనకల్పవల్లియనుచు ।
తిలకింపఁజైతన్యకలితమైవనవీథిఁ బొడనూపురతనంపుఁబొమ్మయనుచు ।
నవిహార్యాత్మమూర్తియవామరూప । లలితయగువనదేవతాలలనయనుచు ।
మదనుచరులెల్లవిభ్రాంతమానసముల । నెంచిరాబాలికామణిఁగాంచినపుడు ॥

మేనక — మనము సాధారణంబుగ నాకాదిలోకములయందుఁ జూచుచుండు దేవతాస్త్రీల నెవరిని ఆ బాలికామణి పోలినట్లుండెను.

స్వారోచి — నేను మృగయావినోదమునం దత్యాతురుండనైయుండి దూరముననున్న యా బాలికను అంతగా గమనించి చూచినవాఁడను కాను. అయినను.

సీ॥ భవఫాలనయనాగ్నిఁబడిపోరు నామాఱురమణనారయురతీరమణియొకొ ।
నవ్యోపరాగసనాథుతారానాథు గాననిరోహిణీకాంతయొకొ ।
సర్వభక్షకశాపసంతప్తునిలాప్తురోయుస్వాహావరారోహయొకొ ।
బ్రహ్మహత్యాపాపభగభీతుపురుహూతు తెరువుఁగాననిశచీదేవియొకొ ।
నృహరిరూపంబుఁదాల్చుటనెఱుఁగకంబు । జాతుఁఁబాసినలక్ష్మిమృగాక్షియొకొ ।
యనుచు నాలేమదూరమునందునందు । గాంచిపరిజనులెల్ల శంకించిరపుడు ॥

మేనక — స్వారోచి నీవు నిన్నాబాలికామణి శరణుఁజొచ్చినప్పుడు నీకు సమీపమున నిలిచియున్నదానిన్ జక్కఁగఁ జూచియుండవచ్చునె తదీయసౌందర్యలావణ్యాదు లెట్లుండెనో నీముఖంబున వినఁగోరెద.

స్వారోచి — వర్ణనలయందు నేను విశేషచాతుర్యముగలవాఁడను కాను. అయినను నాకున్ దోఁచినంతమాత్రము తెలిపెద.

సీ॥ జలజాక్షిముఖకంతముల కాంతిధగదగల్ రుచిరాబ్జరుచిరాబ్జరుమలనణఁచు ।
లలననిర్భరకుచాలకములచకచకల్ సారంగపారంగపారమణఁచు ।

రమణిదృక్ప్రియపదానమదీప్తిమిసమినల్ రాజీవరాజీవరాజినణఁము।
తరుణిసుందరకరాధరరుచినిగనిగల్ లలిఁబ్రవాళప్రవాళములనణఁచు।
నాతివరదంతనఖధళధళలుతివిరి । తవిలితారాలితారాలిదర్పమణఁచు।
దానిసరివాని మేలగుదానినరసి । కానరాదెందు సకలలోకములయందు॥

మేనక—ఉండవచ్చును స్త్రీలయుందలి సౌందర్యలావణ్యాదులు వేఱుచూచువారి మాన సములయందు అభిరుచిఁ గలిగించు శోభాతిశయము వేఱు. ఈ రెంటియొక్క ఐక్య భావము ఆలలనామణియం దెట్లుండునో.

స్వారోచి—

ఉ॥ దానిమహాభిజాత్యమును దానిమహారుచిరాభిరూప్యముఀ।
దానివయోవికాసమును దానిమనోజ్ఞవచోవిలాసముఀ।
దానిప్రగల్భతాయతియు దానిముఖాభినవానుభావముఀ।
మానసవీధినాటునొకమాటఁబమాటున దానిఁజూచినఀ॥

మేనక—సంతోషము అయ్యో! మహాప్రాణభయార్తయు శోకవ్యాకులితచిత్తయునై అలసి సొలసి యున్నకాలమున నంతటి సౌందర్యశాలిగానున్న యా నారీమణి సం పూర్ణ సంతోషవికాసభాసురియై యున్నయపు డెట్లుండునో.

స్వారోచి—అది వాచామగోచరము.

మేనక—ఆహా! కమనీయ తపనీయ మణీమయ భూషణ భూషితయై యాబాల మోల నుంచిన నెట్లుండునో.

స్వారోచి—తదీయాంగసౌష్ఠవ లావణ్యాదులు భూషణంబులకుఁ బరమభూషణంబులు తద్విభవాతిశయంబునకు భూషణంబు లనావశ్యకంబులు.

మేనక—నీకాకన్యక నియ్యవలయునను నభిలాష ఇందీవరాక్షునకు సమగ్రంబుగనున్నది.

స్వారోచి—ఉన్నదని నాకుఁ దోఁచుచున్నది.

మేనక—నక్షత్రానుకూల గ్రహమైత్ర్యాదుల ననుసరించి లగ్నబలిమి యెట్లుండునో విచా రించిచూడవలయు.

స్వారోచి—

క॥ భంబులతో గ్రహరాశిగ । ణంబులతోఁగగనమంగనామణికవల।
గ్నంబగుటలగ్నమనుకూ । లంబయగుఀనర్వవిధములఀబరికింపఀ॥

మేనక—సంతోషము అయినను నీవు అనన్యసామాన్యరూపలావణ్యాదులు గలవాఁడవని లోకంబులు గొనియాడుచుండు నీకాయంగన అనురూపయగు భార్య కాఁదగినో

దగునా యను సంశయము మాకందఱకు అనివార్యంబుగఁ బొడముచున్నయది. మేమా కన్యకను కన్నులారఁ జూచికాని నిశ్చయించుట యుక్తంబుగాదని తోఁచుచున్నది.

స్వరోచి—ఇదియును అనావశ్యకమె.

మేనక—ఎందుకు.

స్వరోచి—నీనాలావణ్యవతికిన్ దగినవాఁడ నగుదునా అను సందేహము నాకే బొడముచున్నది.

(అంతట వరూధిని రంభ మేనకలు పరస్పర ముఖావలోకనంబులు సలుపుచు నవ్వుచున్నారు.)

స్వరోచి—(తలయూఁచి సంశయించుచు) ఈ నవ్వులకుఁ గారణంబేమి!

మేనక—వేఁటకాలమున జరిగిన వృత్తాంతములన్నియు నిదివరకె చారులవలన వినియుంటిమి. మనోరమయందు నీకుఁ గల యభిప్రాయ మనోనురాగాదులు మాత్రము తెలిసియుండలేదు. ఆ విషయముమాత్రము నిన్నడిగిన స్వభావసంకోచభావంబున నీవు వాక్రువ్వవని తలఁచి వృత్తాంతము వినఁగోరునెపంబున నిన్నీరీతి నడిగితి. నీ హృదయాభిప్రాయాదులు నీముఖంబునన వినుట మాకందఱకు నత్యంతానందకరంబై యున్నయది చాలును.

స్వరోచి—ఇట్లనా. మీయభిప్రాయము. (అని లోపలికి వెడలిపోవుచున్నాఁడు.)

మేనక—చెలియా వరూధినీ! నీ కోడలి రూపలావణ్యాదులును నీ సుతుని యభిలాషాదులును విని సంతసించితివా.

రంభ—మనమందఱమును శీఘ్రకాలంబునఁ బెండ్లికిఁ బోవలసివచ్చును.

మేనక—ఇందీవరాక్షుఁడు ముహూర్తము నిశ్చయించి పిలువనంపినప్పుడుకదా.

వరూధిని—అది మిగుల సావకాశమగునేమో.

రంభ—అబ్బా వరూధినీ! నీ కెంతయాతురమే.

మేనక—ఆతురమే కొడుకుపెండ్లి కోడలిరాక.

రంభ—నిజమే. అపుత్రకలగు మనకానంరంభ సంభ్రమాదు లెట్లెఱుంగనగు.

వరూధిని—చెలియలారా! మీపరిహాసములు చాలు. మధ్యాహ్నంబయ్యె. స్వరోచి అలసివచ్చియున్నవాఁడు. స్నానమునకున్ బోదము.

రంభ-మేనక—అట్లనే. (అని లోపలికి పోవుచున్నారు.)

---

## పంచమాంకము—ద్వితీయరంగము.

(స్వరోచి సభారంగము.)

[గురు మంత్రి దండనాయకాది సమస్తపరివారముతో స్వరోచి కొలువుండుచున్నారు.]

స్వరోచి—(గురుముఖంబుఁజూచుచు) మహాత్మా! నామృగయావిహారవృత్తాంతమాద్యంతము సవిస్తరంబుగ విన్నారుకదా!

గురుఁడు—ఇంతకుముందు మన దండనాయకాదులు వివరింప వింటిని. ప్రయాణలగ్నము మంగళకరమైయుండెనని నేను వక్కాణించియుండలేదా!

మంత్రి—మహాత్మా! తమవాక్కు లమోఘంబులు. మన రాజుగారికి శీఘ్రకాలంబున కల్యాణలాభము కాఁగలదు.

గురుఁడు—అదియును బహుశీఘ్రప్రస్థితియందున్నది.

మంత్రి—గంధర్వలోకమునుండి వివాహాహ్వానపత్రికను నిరీక్షించుచున్నాఁడను.

స్వరోచి—దండనాయకా! మృగయార్థంబు మన వెంబడివచ్చియున్న పరివారమంతయు సురక్షితంబుగ వెనుకకు వచ్చియున్నదా!

దండనాయకుఁడు—వీరవర్యా! వచ్చియున్నది.

స్వరోచి—వేఁట తమకంబున సవ్రణులై అలసి యున్నవారందఱు తత్తదుచిత శకట శిబికాందోళికాదుల సహాయంబున నగరంబుఁ జేర్పఁబడి యున్నవారా!

దండనాయకుఁడు—అట్టివారందఱిని యుక్తరీతి సుఖప్రయాణంబుల నిరాయాసంబుగ నగరంబు జేర్చియున్నాఁడను.

స్వరోచి—వారికిఁ దగిన చికిత్సోపచారంబులకుఁగాను అస్వస్థలగు వైద్య పరిచారక జనంబులు క్రమంబుగ నియమింపఁబడియున్నవారా!

దండనాయకుఁడు—మన మంత్రిగారితో నాలోచించి సమస్తంబును ప్రశస్తంబుగ నాయత్తపఱచియున్నవాఁడ.

(ఇంతలో నొక కంచుకి లోపలికివచ్చి ఘటితాంజలిపుటుండై.)

కంచుకి—మహాప్రభూ! గంధర్వలోకమునుండి యొక పురోహితుఁడు తమ దర్శనార్థము వచ్చి వేచియున్నవాఁడు.

మంత్రి—(గురుముఖంబుఁజూచుచు) మహాత్మా! ఇది బహుశుభసూచకంబుగ నున్నదే.

గురుఁడు—అవును. అతని నిట రానిమ్మని యాజ్ఞాపింపుము.

మంత్రి—ఓయి! కంచుకి ఆ పురోహితుని నిటకుఁ దోడ్కొనిరమ్ము.

కంచుకి—మహాప్రసాదము. (అని వెడలిపోయి పురోహితునిఁ బిలుచుకొనివచ్చుచున్నాఁడు.)

పురోహితుఁడు—(రాజు నెదుట నిలువంబడి రెండుచేతులయందు కుసుమఫలాక్షతలు ధరించి స్వరోచి నుద్దేశించి.)

ఉ॥ స్వస్తికృపాగుణాభరణ స్వస్తిజగజ్జనసౌఖ్యకారణా।
స్వస్తినరామరాహితసమస్తనిశాచరలోకమారణా।
స్వస్తికృతాభిమానగిరిజాకరుణాపరిపాలితోల్లస।
న్నిస్తులబాహువిక్రమతృణీకృతమత్తసహస్రవారణా॥

(అని స్వరోచికి కుసుమఫలమంత్రాక్షతలిచ్చి లగ్నపత్రికను చేతికిచ్చుచున్నాఁడు.)

స్వరోచి—(లేచి కుసుమ ఫల మంత్రాక్షతలు మంత్రిచేతికిని లగ్నపత్రికను గురునిచేతికిని యిచ్చి పురోహితునకు నమస్కరించుచున్నాఁడు.)

పురోహితుఁడు—

క॥ కల్యాణముమీకగుశుభ। కల్యాణముమీకగుఁ దగఁ గ మతియుమహా।
కల్యాణముమీకగుసా। కల్యంబుగిలోకవినుతగాంభీర్యయుతా॥

మంత్రి—(లేచి పురోహితుని చేయిపట్టి సుఖాసీనుఁ జేసి తాను నమస్కరించి గురుని ముఖంబుఁజూచుచు.)

మహాత్మా! ఇప్పుడుకదా మనయందఱ మానసంబులు నిర్భరానందపరిపూర్ణంబులైనవి. నామనవి చిత్తగించి యీశుభపత్రికఁ జదివి సభాసదులకు వినుపింపుఁడు.

గురుఁడు—అట్లనె. (అని చదువుచున్నాఁడు.)

క॥ శ్రీరస్తువిశ్వవినుతయు। శోరాజితరాజ్యమస్తుశుభమస్తుమహా।
దారిపరాక్రమయుతఘో। రారిచమూరాజివిజయమస్తనికరుణఁ॥

క॥ ఇందీవరాక్షుఁడెంతయు। సుందరశోభాయమానసుమమాహసితా।
మందారుణరోచిస్వరో। చిందగనాశీర్వదించి శీకరఫణితిఁ॥

సీ॥ వ్రాయించుచేమనవరనుతయగుమనోరమనుమీకొసఁగిసంప్రీతిమమెలర్ప।
మఱునాఁడుమధ్యాహ్నమకరలగ్నంబునఁ బెద్దలయనుమతిఁ బెండ్లిసేయ।
నిశ్చయించితిమీకు నిఖిలార్యబంధుమిత్రాళితో నిపుడెప్రయాణమగుచు।
వారక నిటకురావలయు నెల్లియ సమక్షంబునఁగలసకలంబుఁ దెలియ।
మానసంబునఁగలయభిమానమిపుడు। మానకిటవచ్చిమాకుసమ్మానమిచ్చి।
మానినీమణిఁ జేపట్టిమనుపవలయు। నఱమరలులేనికూరిమి నెఱపవలయు॥

గురుఁడు—వింటిరా సభికులారా! ఇందీవరాక్షుఁ డెంతటి వినయ వివేక సంపన్నుఁడు.

(మంత్రిదిక్కు జూచుచు.)

మంత్రివరా! ఇఁక నాలస్యమెందుకు రేపు మంచిశుభదినంబుగ నున్నయది ప్రయాణంబునకుఁ దగిన సకలసన్నాహసామగ్రిని సిద్ధపఱుపుము. మన రాజుగారితల్లియగు వరూధినిమున్నగుహితులతో నాలోచించి సందర్భోచితంబులగు వస్త్రభూషణాదుల నాయత్తపఱుపుము. నీవిట నుండవలసివచ్చును. యుక్తపరిజనసమేతుండనై నేను వెడలి యచ్చటికార్యంబులన్నియు నిర్విఘ్నంబుగ నెఱవేర్చుకొనివచ్చెద.

మంత్రి—చిత్తము. అట్లనె.

గురుఁడు—స్వరోచి! ఇఁక కొలువుచాలును. మనమీ పురోహితసహితంబుగ నభ్యంతరగృహంబునకుఁ బోయి యీ శుభవార్తలు వరూధినీముఖ్యులకుఁ దెలిపి ప్రయాణసన్నాహంబు లొనర్తము.

(అని అందఱును నిష్క్రమించుచున్నారు.)

ఇది ద్వితీయరంగము.

## పంచమాంకము—తృతీయరంగము.

(గంధర్వలోకము.)

[ఇందీవరాక్షుఁడు స్వరోచి మొదలగువారు తమ తమ బంధుమిత్రజనంబులతోఁ గూడి వివాహమంటపమున నుండుచున్నారు.]

ఇందీవరాక్షుఁడు—(పురోహితునిదిక్కు చూచుచు.) ఆర్యవర్యా! నిశ్చితలగ్నకాలం బాసన్నమై యున్నయది. అక్షతారోపణాదులు జరుగనిండు.

పురోహితుఁడు—(ఇందీవరాక్షునిభార్యయగు సురుచిరదిక్కు చూచుచు.) కన్యకను నూతనవస్త్రాభరణాలంకృతఁ జేసి కాత్యాయనీమహాదేవిపూజ చేయించియున్నారా.

సురుచిర—సర్వము సిద్ధముగనున్నది.

పురోహితుఁడు—(తెరఁబట్టి దానికీవలావల వధూవరుల నిలువఁ జేసి సభాసదులఁ గూర్చి) మహాజనులారా! అక్షతారోపణ పాణిగ్రహణాది మహోత్సవంబుల కనుజ్ఞ గోరెద.

సభాసదులు—శుభమస్తు.

పురోహితుఁడు—(ఘంటానాద మొనర్చుచు.)

క॥ శ్రీరమణచరణసేవా । పారీణుఁడనగుచువిఘ్న భయముదొలంగన్ ।
భూరితరభక్తిఁగరుణో । దారునిగణనాథునాత్మఁదలఁచినుతింతున్ ॥

క॥ శ్రీకరమగుకరుణసదా । స్తోకములగుశుభములీవధూవరులకసం।
ఖ్యాకముగనొసఁగసకలది । వౌకసులన్ వరుసనవినయంబుగఁదలఁతున్ ॥

మ॥ విరతాభంగసుమంగళీత్వమునునిర్నిద్రప్రతాపోదయ।
స్ఫురణంబున్ సతతాన్నదానమహిమంబున్ బూజ్యసామ్రాజ్యవై।
ఖరియున్ గూర్చుచునీవధూవరుల వేడ్కన్ బ్రోవఁగా నాశచీ।
పురుహూతాంఘ్రిపయోజముల్ మనమునన్ బూజింతునశ్రాంతమున్ ॥

మ॥ భరితాపారకృపావిశేషమునదీప్యద్బుద్ధిచాతుర్యని।
ర్భరశౌర్యాధికధైర్యవీర్యములవార్యప్రాభవంబుల్ వధూ।
వరసౌఖ్యాప్తికినై యొసంగితగఁ బ్రోవన్ భక్తినాభారతీ।
పరమేష్ఠిప్రథితాంఘ్రిపద్మములుసంభావింతునశ్రాంతమున్ ॥

మ॥ నవలావణ్యవిలాసవిస్ఫురితసౌందర్యప్రభారాశివై।
భవమేకాలముఁగల్గివీరలతిశుంభత్సానురాగాధికో।
త్సవదాంపత్యసుఖానుభూతిగనిమించన్ జేయఁగాంక్షించిహై।
మవతీసాంబపదారవిందములుసంభావింతునశ్రాంతమున్ ॥

శా॥ నానానీతికళావిశేషములునానాభోగసౌభాగ్యసం।
తానాయుఃపరిపాకసౌఖ్యములునిత్యంబున్ బ్రసాదించిన।
వ్యానందోదయమీవధూవరులకత్యంతంబుసంధింపల।
శ్రీనారాయణపాదపద్మములెదన్ జింతింతునశ్రాంతమున్ ॥

(తెరఁ దొలఁగన్ దీసి యక్షతారోపణము చేయించుచున్నాఁడు.)

(అనంతరము వధూవరుల నొండొరుఁల జేతులువట్టనిచ్చి కూర్చుండఁబెట్టి సువాసినులు హారతి సేయుచున్నారు.)

సువాసినులు—

క॥ మంగళమువధూవరులకు । మంగళమురతీరతీశమహితాంగులకున్ ।
మంగళముకుసుమసౌరభ । సంగోపమయోగభోగసౌభాగ్యులకున్ ॥

క॥ మంగళముమనోరమకున్ । మంగళమునిజాంతరంగమానితరమకున్ ।
మంగళముమనోరమది । వ్యాంగజితస్వర్ణఘనమహాద్రుచిరమకున్ ॥

మత్తకోకిల॥ మంగళంబసమానమానితమానమండనధారికిన్।
మంగళంబనివార్యశౌర్యరమాలసద్భుజశోభికిన్।
మంగళంబుబుధావనాదరమానసోదయహారికిన్।
మంగళంబుధరిత్రి నప్రతిమానుఁడైనస్వరోచికిన్॥

ఆనందలహరి॥ మంగళములసమానభూర్యసమానవైభవశోభికిన్।
మంగళముబహుమానినీజనమానహారిసురూపికిన్।
మంగళముబహుమానభాగభిమానమానితసూరికిన్।
మంగళము జయమంగళం శుభమంగళంబు స్వరోచికిన్॥

ఆనందలహరి॥ మంగళముఘనమండలాయితమండలాగ్రవినోదికిన్।
మంగళమురిపుమండలాయుతమండలాగ్రవిహారికిన్।
మంగళముబహుమండలవ్రజమండలాయితకీర్తికిన్।
మంగళము జయమంగళం శుభమంగళంబు స్వరోచికిన్॥

టిప్పణము.

---

మండలాగ్రము = కత్తి.

మండలము = పరివేషము, సమూహము, సేనావ్యూహము, దేశము, భూషణము. (శబ్దార్థకల్ప.)

(అంతట అందఱును నిష్క్రమించుచున్నారు.)

సూత్ర—(సభాజనులఁ గూర్చి.)

మహాజనులారా! నమస్కారములు. నే నాదియందు విన్నవించినమేరకు నీ నాటక కథా భాగములన్నియు నింతటితో ముగిసినవి.

మ॥ ఇది శ్రీరాద్రపురీశరాఘవపదాబ్జైకాగ్రభక్తిస్ఫుర
న్పదగొద్దంహనుమంతరాయరచితస్వారోచిషాఖ్యాతిహ।
ర్షదచిత్రార్థరసధ్వనిప్రకరభాస్వన్నాటకంబీసభా।
సదులెల్లన్ సదయానుభావమురహింపన్ దీనిఁగైకోఁదగున్॥

(అని నమస్కరించి నిష్క్రమించుచున్నాఁడు.)

స్వారోచిష నాటకంబునందు సర్వంబును పంచమాంకము.

సమాప్తము.

---

ఈ కవిమిత్రుండును, పెనుగొండగ్రామమందుండు స్కూలు హెడ్డుమేష్టరును, నారాయణవనము - కూరుత్తాళ్వారు కవివరుండు ఈ గ్రంథమునుగూర్చి వ్రాసిన పద్యము.

చ॥ అమలసువర్ణశయ్యసము * దంచితవృత్తవిలాసభాసురో
త్తమగుణజాత్యలంకృతివి * తానలసద్ధ్వనిపాకరీతివి
భ్రమవివిధార్థగౌరవర * సప్రకరంబులనొప్పగుల్కఁగా
ద్దముహనుమంతరాయకవి * తాలలితాంగిముదంబుగొల్పెడున్॥



Printed at the Vaijayanti Press, 32, Mount Road, Madras

